# పెళ్లిపెద్దలు

ర చ న

శ్రీ సీతంరాజు వెంకటేశ్వరరావు

ప్ర కా శ కు లు

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్,

సంస్కృతాంధ్ర బుక్‌డిపో [స్థా. 1882] రాజమండ్రి.

# మనవి

ఈ నాటకానికి సంబంధించిన ప్రదర్శనపు హక్కులు మాత్రం నాకు చెందియున్నవి. నా అనుమతి ముందుగా పొంది మరీ ప్రదర్శించాలి.

సత్యనారాయణపురం,<br>విజయవాడ. } ఇట్లు,<br>సీతంరాజు (రచయిత)

# ఈ నాటకం!

పంచవర్ష ప్రణాళిక సంబంధమైన "రామరాజ్యం" నాటకం వ్రాస్తున్న రోజుల్లో మిత్రులు నారాయణబాబు (వెంకటగిరి) ప్రోత్సాహంతో వ్రాయబడి, తొలిప్రదర్శనం నెల్లూరులోనే జరిపి పండిత పామరుల ప్రశంసల నందుకొని, ఆంధ్రావని లోనేగాక తదితర ప్రాంతాల్లోకూడా వివిధ సంస్థలద్వారా వందలాది ప్రదర్శనాలు జరుపుకుంటున్న "పెళ్ళి" అనే నాటకాన్నే వరకట్న నిషేధ చట్టాన్ని అనుసరించి అభిమానుల సలహాలనుపొంది అనేక మార్పులతో "పెళ్ళిపెద్దలు" నాటకంగా రూపొందింది.

శ్రీయుతులు చింతామణి దేశముఖ్ దంపతులు, జె. సోమ యాజులు, ఏ. నాగేశ్వరరావు, శివరావు, ఇంటూరి, పినిశెట్టి వగైరా ప్రముఖుల సమక్షంలో శ్రీయుతులు 'ఆంధ్రప్రభ' ఎడిటర్ నార్ల వెంకటేశ్వరరావుగారి అధ్యక్షతను మద్రాసు వాణీమహల్లో ప్రదర్శింపబడి వివిధ పత్రికల ప్రశంసల నందుకున్న కళాఖండం!

మార్పుల విషయంలో నాకు సలహాలను యివ్వటమేకాకుండా ప్రదర్శనం జరిగేవరకూ నాకృషికి అన్నివిధాలా తోడ్పడిన శ్రీ ముదిగొండ లింగమూర్తి, ప్రదర్శనానికి అన్నివిధాల చేయూతనిచ్చిన శ్రీయుతులు నార్ల వెంకటేశ్వరరావు, చిత్తూరి వి. నాగయ్య, తదితర ప్రముఖులకు, నాతో సహకరించి ప్రదర్శనం జయప్రదంగా జరిపించిన నటీనటులకు, నిర్వహణ బాధ్యత వహించిన సుబ్బారావ్, సీతారామారావు వగైరా మిత్రులకు నా హృదయపూర్వక అభివందనాలు!

ప్రదర్శింపదలచినవారు రిహార్సల్సు యెక్కువగా జరుపుకోవాలి. ప్రతిఒక్కరూ పాత్రను అర్థంచేసుకొని కంఠస్థంచేయాలి. ప్రదర్శనానికి సంబంధించిన వస్తువులు అన్నీ ముందుగానే సిద్ధంచేసుకోవాలి. ఆశావాసులకు నాటక ప్రారంభంనుంచీ కూడా పెళ్ళికుమార్తు, పెళ్ళికుమార్తెగానే కనుపించాలి. మొదటి రంగంలో నీతి, అవినీతి స్పష్టంగా చూపించాలంటే సీతయ్య వెనక తెల్లని తెరకట్టి ఆ తెరవెనుక మనుషుల్ని నిలబెట్టి వాళ్ళకు అవతలగా లైటుపెడితే వాళ్ళనీడలు తెల్లని తెర మీదకు వస్తాయ్. యిందులో పాటలువుంటే బాగుంటుంది అనుకునేవార్కి సలహాయేమంటే ; అన్నిచోట్లా పాటలు పెట్టెందుకు వీలుపడదు. అంచేత నాకు తెలియపరుస్తే పాటలు పాడవలసినచోట్లు తెలియబరుస్తూ అందుకు సంబంధించిన పాటలు పంపుతాను. ప్రదర్శనం జయప్రదంగా జరగాలంటే యే చిన్నవిషయంలోనూ అశ్రద్ధ చూపకూడదు. శెలవ్.

సత్యనారాయణపురం
విజయవాడ - 2
ఆంధ్రా.

మీ
సీతంరాజు
(రచయిత)

28—8—55 తేదీన తొలిసారిగా
ప్రోగ్రెసివ్ ఫ్రెండ్స్ ఆర్టు థియేటర్‌వారిచే
నెల్లూరు టౌనుహాలులో ప్రదర్శించిన
“ పెళ్ళి ” నాటకంలో పాల్గొన్న నటీనటులు.

పురుషోత్తం :—శ్రీ సీతంరాజు
వెంకటేశం :—శ్రీ లక్ష్మణరావ్
పరమేశం :—శ్రీ రమణరావ్
గిరీశం :—శ్రీ శౌరిరాజ్
సీతయ్య :—శ్రీ నారాయణబాబు
దాసు :—శ్రీ ప్రసాద్
వాసు :—శ్రీ చదలవాడ (జూనియర్)
పురోహితుడు :—శ్రీ నటరాజ్
ఆశ :—శ్రీమతి వరలక్ష్మి

బేగ్రౌండ్ మ్యూజికల్ ఎఫెక్ట్స్ :
జయరాం అండ్ పార్టీ

ఆర్టు :
కేశవరావ్

మేకప్ :
ప్రోగ్రెసివ్ ఫ్రెండ్స్ ఆర్టు థియేటర్

ప్రొడక్షన్ :
కేశవరావ్, నాగరాజు, సుశీల, రంగనాయకమ్మ వగైరాలు

దర్శకత్వం :
వి. నారాయణబాబు (వెంకటగిరి)

నెల్లూరు, చిత్తూరు జిల్లాల వరద బాధితుల సహాయార్థం
20—12—57 తేదీన మద్రాసు వాణీమహాల్లో
అభ్యుదయ కళాసమితివారిచే
ఆంధ్రప్రభ ఎడిటర్ శ్రీయుతులు నార్ల వెంకటేశ్వరరావుగారి
అధ్యక్షతను జరిగిన ప్రదర్శనంలో పాల్గొన్న నటబృందం.

పురుషోత్తం :—శ్రీ కోళ్ళ సత్యం
వెంకటేశం :—శ్రీ పీసపాటి రామారావు
పరమేశం :—శ్రీ సీతంరాజు (రచయిత)
గిరీశం :—శ్రీ రామారావు
సీతయ్య :—శ్రీ యన్. వి. యన్. చారి
దాసు :—శ్రీ రంగాచారి
వాసు :—శ్రీ పీసపాటి వెంకటేశ్వర్లు
1వ శాస్త్రి :—శ్రీ సత్యనారాయణ
2వ శాస్త్రి :—శ్రీ శర్మ
పోలీసులు :—శ్రీ సీతారాం; మాధవరావ్
ఆశ :—కుమారి పార్వతి

దర్శకత్వం :

శ్రీ సీతంరాజు

పర్యవేక్షణ :

శ్రీ ముదిగొండ లింగమూర్తి (సినీమానటులు)

## ★ ఇందులో వచ్చే పాత్రలు ★

* పురుషోత్తం
* వెంకటేశం
* పరమేశం
* గిరీశం
* సీతయ్య
* వాసు
* దాసు
* ఆశ వగైరాలు.

## * కథా కాలం *

రాత్రి 10 గం॥ నుండి తెల్లవారుఝామున 3-30 గం॥ వరకూ రెండు కుటుంబాలమధ్య జరిగిన కల్లోలమే ఇందలి ఇతివృత్తం.

# పెళ్ళిపెద్దలు

## రంగం 1

[ అది పెళ్ళివారికి యిచ్చిన విడిదిలో ఒకగది. సమయం రాత్రి పదిగంటల ప్రాంతం. ఎదురుగోడకు దణ్ణెం. కొన్ని కొత్తగుడ్డలతోను, కుడివేపుగోడకు రెండు ఫొటోలు, వాటిమధ్యనే గుమ్మం. దణ్ణెమునకు కొంచెం పైభాగంలో కిటికీ కనిపిస్తూంటాది. గదిలో ఒకమూలగా రెండుట్రంకులు, రెండుకుర్చీలు వాటిముందు చిన్నటీపాయ్, దానిమీద టేబులుక్లాత్, ఫ్లవర్‌పాట్. ఒక ప్రక్కగా పరుపు, దానిమీద తెల్లని దుప్పటి పరచివున్న మంచం. మంచానికి ఎదురుగావున్న గోడప్రక్కనే టేబులు, దానిమీద అద్దం, టాయిలెట్ సామాన్లు కనిపిస్తూంటాయ్. తెర ప్రక్కకు తొలుగుతుంది. ]

వాసు: (అద్దంలోచూచి తలదువ్వుకుంటూ వుంటాడు. ప్రక్క గదిలోనుంచి పెళ్ళికి సంబంధించిన రికార్డు వినిపిస్తూంటుంది. వాసు అద్దంలో చూసుకుంటూనే) బావా! (స్థాయిపెంచి) ఒరేయ్ బావా!.........(లోపలకు చూస్తూ రెండడుగులేసి చిరుకోపంతో) ఒరేయ్ ఫూల్! వెంకటేశం!

వెంక: (లోపలనుంచే) ఆ! ఏమిటోయ్!

వాసు: ఇలారా!

వెంక: ఎందుకు?

వాసు: రమ్మంటే!

వెంక: (వస్తూనే) ఏం?

వాసు: రికార్డులు ఆపెయ్.
వెంక : కష్టంగా వుందా ?
వాసు: వుంది కనుకే !
వెంక : (హేళనగా) నాకేంలేదే !
వాసు: (మందలింపుగా) ఆపుతావా లేదా ?
వెంక : మనం దేనికొచ్చాంరా !
వాసు: పెళ్ళికి.
వెంక : వున్నదెక్కడ ?
వాసు: విడిదిలో.
వెంక : అవును కదా !
వాసు: అయితే ?
వెంక : పెళ్ళివారికి కావలసిందేమిటో తెలుసా ? ఒళ్ళు మర్చిపోయే సంగీతం ! మాంచి సందడి. అసలీసందర్భమే అటువంటిది ! (వాసు వెంకటేశాన్ని చూస్తాడు) అయినప్పుడు వద్దనటానికి నువ్వెవరు ?
వాసు: పెళ్ళికొడుకుని.
వెంక : అయితే పెళ్ళిచేసుకో !
వాసు: (మందలింపుగా) ముందు నోరుమూసుకొని ఫోను మూస్తావా ? లేదా ?
వెంక : (ఎగాదిగాచూచి) పెళ్ళికాకుండానే కళ్ళు మూసుకుపోయినాయ్. ఆకాస్తా అయినాక యింక నీకు పట్టపగ్గాలుంటాయా ?...... కాస్త ఒళ్ళు దగ్గరపెట్టుకు ప్రవర్తించాలిరా !
వాసు: (మందలింపుగా) ఊఁ !

వెంక : మెదిత్తే ముక్కూడి పోయేట్లుందేంరోయ్. అంత ప్రమాదానికిమాత్రం రానీయను. (లోపలకు వెడతాడు. వాసు వెంకటేశం వెళ్ళిన మార్గాన్నిచూచి నవ్వుతాడు) మూశాన్లేరా పోను! (లోపలనుంచి వస్తూనే అంటాడు)

వాసు: వెరీగుడ్ ! (నవ్వి) సరేగాని బావా! చూశావా ?

వెంక : (పరాకుగా) చూశాను. (తేరుకొని) ఏమిటది ?

వాసు: (కొద్దిసిగ్గుతో) అవబోయే భార్యను.

వెంక : ఓహో !

వాసు: ఎలావుందంటావ్ !

వెంక : ఏం బాగుల్లేదంటాను.

వాసు: (త్రుళ్ళిపడి ఆశ్చర్యంగా) ఆఁ !

వెంక : అవును !

వాసు: మతిపోయిందేంరా !

వెంక : లేదే !

వాసు: మరి అందంగా లేదంటావేం ?

వెంక : ఎవరు ?

వాసు: పెళ్ళికూతురు !

వెంక : బాగుండచ్చు !

వాసు: బాగుల్లేదందెవర్ని ?

వెంక : నిన్ను !

వాసు: నన్నా !

వెంక : కాకపోతే యేమిట్రా ? నీపెళ్ళాం అందచందాల విషయంలో మరొకర్ని అడగటం......

వాసు: బాగుళ్ళేదా ? (నవ్వి) చూశావుకదరా !
వెంక : చూస్తే ?
వాసు: నీఅభిప్రాయం తెల్సుకుందామని అడిగాను.
వెంక : అదే వద్దంటా ! నీకు తలకాయలేదూ ?
వాసు: కనుపించటల్లా ?
వెంక : వున్నా లేనట్లేవుంది !
వాసు: ఏం ?
వెంక : వుంటే యీ చప్పుదంటు ప్రశ్నలేమిటి ? అంతగా కావాలంటే... ...
వాసు: సలహా యిస్తున్నావా ?
వెంక : ఇవ్వకుంటే బ్రతకనిస్తావా ?
వాసు: ఆమాత్రం భయముంటే చాలు ! యేమిటి నీసలహా !
వెంక : టిప్‌టాప్‌గా డ్రస్ చేసుకున్నావుకదా !
వాసు: ఊఁ !
వెంక : పెళ్ళివారిల్లుకూడా ప్రక్కనేవుందామె !
వాసు: వుంటే ?
వెంక : ఎరగనట్లుగా, యేదో పనున్నట్లుగా, వాళ్ళ గుమ్మం ప్రక్కనుంచే వెళ్ళు !
వాసు: (అర్థంకానట్లు) వెడితే !
వెంక : అక్కడ ఒక్కక్షణంఆగి బాగా పరికించిచూడు.
వాసు: చూస్తే ?
వెంక : (విసుగుతో వెటకారంగా) వుంటే, వెడితే, చూస్తే, యేంమాటలురా అవి ? యింట్లోనో, బయటనో,

పెరట్లోనో, ఆ పిల్ల కనుపించక పోతుందా ? కనుపిస్తే టపీమని ఒకపోజు పారేసిరా !

వాసు: మంచిసలహాయే !

వెంక : ఇంతకంటే మరో సలహా యివ్వలేను, యివ్వను. మీరు వెళ్ళొచ్చేలోపుగా మనం రికార్డులు దంచేస్తాం! (వెళ్ళబోతాడు.)

వాసు: (రెక్కపట్టుకు ఆపుతూ) అదాసంగతి ? మనం వెళ్ళనూ వెళ్ళం ! తమరు రికార్డులు వేయనూ వేయద్దు !

వెంక : ఏం చేద్దామంటావ్ ?

వాసు: కూర్చొని కులాసాగా మాట్లాడుకుందాం.

వెంక : ఏముంటాయిరామాటలు ?

వాసు: చెప్తాను కూంర్చోమరి. (రెక్కపట్టుకు కూర్చోపెట్టి, తనూ కూర్చుంటూ) బావా ! అసలాపిల్ల ... ...

వెంక : (విసుగుతో) అబ్బబ్బబ్బ ! చూశావుకదరా !

వాసు: లేదురా ! పెళ్ళిచూపులకు వెళ్ళినప్పుడు సరిగా చూళ్ళేదురా !

వెంక : ఏం పాపం ?

వాసు: తీరా వాళ్ళయింటికి వెళ్ళేసరికి సంధ్యవేళయింది. అప్పటికప్పుడే లోకమంతా చీకటిమయమయింది.

వెంక : (నాలుక చప్పరించి హేళనగా) ఆ సూర్యభగవానుడు కొంచెంసేపు అలా నిల్చిపోయినా బాగుండేదిరా !

వాసు: కాని, బావా ! చీకటిగావున్నా రూపురేఖలు బాగానే వున్నట్లు కనుపించాయ్.

వెంక : (బరువుతీరినట్లుగా) యింకేం !

వాసు: (సందేహంగా) కలరే ఆట్టే కనుపించలేదురా !

వెంక : తెల్లవారుఝామున లైట్లకాంతిలో తళుక్ తళుక్ మంటూ కళ్ళు జిగేల్ మనేలా మెరిసిపోతూ కని పిస్తుంది ! సరేనా ?

వాసు: పడ్చావు లేరా !

వెంక : (తెల్లబోయి) నేనా !

వాసు: పచ్చగానే వుంటుందా ?

వెంక : పాలిష్ చేసిన పెసరపప్పు రంగులో వుంటుంది.

వాసు: హేళన తగ్గించరా ! (లేచి రెండడుగులు వేస్తాడు)

వెంక : నీతొందర బాగుందేం ? (సమీపించి) యింకో నాల్గు గంటల్లో ఆపిల్ల ప్రక్కనకూర్చొని పెళ్ళాడబోతున్నావ్ ! యింతలో అంత ఆదుర్దా యెందుకు ? యిప్పుడు పిల్ల నచ్చకపోతే పెళ్ళిమానేస్తావా ? అయినా మీ చెల్లాయ్ యేమంత అందంగావుందని నేను చేసుకున్నాను ? పిచ్చివాడా ! నన్నడుగుతే ఆలి అనాకారిగానే వుండాలంటా !

వాసు: (అనుమానాస్పదంగా) కొంపతీసి అలాగే వుంటుందా?

వెంక : ఛా ! ఛా ! నీపెళ్ళానికేంరా ! బంగారం బొమ్మ కాదూ ! (నవ్వి, రిస్టువాచి చూసుకుంటూ) అబ్బాయ్ ! యిప్పుడు పదిగంటలైంది. ముహూర్తం మూడుగంటల మూడునిముషాల మూడు సెకండ్లకట ! వెంటనే పడుకుని ఒకకునుకు తీయకపోతే చాలా యిబ్బందవుతుంది ! కాస్సేపు పడుకో. నేనూ వెళ్ళి పడుకుంటా ! (వెళ్ళబోతాడు)

వాసు: ఇదిగో బావా! ఒకమాట! (యేదో చెప్పబోతాడు)
వెంక : (ఆగి) మాటా లేదు, మూటా లేదు. మాట్లాడకుండా పడుకో. (×బగబా లోపలకు వెడతాడు. వాసు చిన్నగా నవ్వుకోని లైటుఆర్పి మంచంమీద పడుకుంటాడు. ఆ వెంటనే పురుషోత్తం నిష్ఠూలు కక్కుతూ విసురుగా బయటనుంచి వస్తాడు.)
పురు : (వాసునితట్టి) వాసూ! ఒరేయ్‌వాసూ! లే! (వాసు లేచి లైట్ వెలిగిస్తాడు) వెంకటేశం! వెంకటేశం! (లోపలకు చూస్తాడు)
వెంక : (ఆవలిస్తూవచ్చి) ఏమిటి మామయ్యా!
పురు : వెంటనే బయల్దేరండి!
వెంక : పెళ్ళివారింటికేనా? అప్పుడే యెందుకు? యెప్పుడో తెల్లవారుఝామునగా పెళ్ళి!
పురు : పెళ్ళీలేదు, గిళ్ళీలేదు వెళ్ళిపోవాల్సిందే! బాబూరావు సుబ్బారావు లేరే?
వాసు: (తెల్లబోయి) సినిమాకు వెళ్ళారు.
పురు : వస్తే వస్తారు మనం పోదాం!
వెంక : ఏమిటిమామయ్యా! అర్థంలేకుండా మాట్లాడతావ్! ఏమైంది?
పురు : వల్లకాడైంది. అవన్నీ ఆనక మాట్లాడుకుందాం. ఈ వూళ్లో ఒక్కక్షణం వుండకూడదు. (టైంచూసి) బండికింకా టయుముంది. తొందరగా బయల్దేరండి! వాసూ! (వాసుని సమీపించి) మీఅమ్మావాళ్ళతో బయల్దేరమని చెప్పు.

వెంక : నీకోపానికి అర్థంలేదు మామయ్యా! జరిగిందేమిటో చెప్పవ్! పూరకే గడబిడచేస్తే యేంలాభం? అనే మాటల్లో అర్థంవుండాలి!

పురు : అంతా వ్యర్థమైంది. మనిషైపుట్టాక మానాభిమానా లుండాలి!

వెంక : ఎవరికి?

పురు : పెళ్ళికూతురు తండ్రికి.

వెంక : అంత పొరపాటేంచేశాడు?

పురు : చేసిందంతా పొరపాటుకాదూ? నాపిల్లవాడికి పెళ్ళి కాదని, గతిగడవక వాళ్ళమ్మాయిని చేసుకుంటా ననుకున్నాడు.

వాసు: (నెమ్మదిగా) కాదునాన్నా!

పురు : కాదూలేదు, గీదూలేదు బయల్దేరండి!

వెంక : ఆలోచనలేకుండా యేపనీ చేయకూడదు మామయ్యా! శాస్త్ర వెనకాముందూ ఆలోచించాలి.

పురు : (వెంకటేశాన్నిచూస్తూ) ఆలోచించే చెప్తున్నాను. (వాసుని సమీపించి) వాసూ! చదువు సంపదవున్న నీకు పెళ్ళికాదని యెంచకు. (గర్వంగా) రేపీపాటికి దీని తలతన్నినసంబంధం తీసుగొస్తాను. (వాసు లోపలకు వెడతాడు. పరమేశం బయటనుంచి వస్తాడు. పురుషోత్తం వెంకటేశాన్నిచూస్తూ) యింత పరువు తక్కువవాళ్ళని మొదట్లో తెల్సుకోలేకపోయాను. అనేదొకటి! ఆచరణలో పెట్టేదొకటి!

పరమ : అదికాదు పురుషోత్తంగారూ!

పురు : ఏదికాదయ్యా ! మహామాట్లాడావు సంబంధం ! అవ్వాళేం చెప్పాను ?

పర : మీరు చెప్పారు, మీతప్పులేదు.

పురు : మరి.... ...

పర : ఆయనమాత్రం యేంచేస్తాడు చెప్పండి ! చేయాల్సిన ప్రయత్నమంతా చేశాడు. కన్నుపొడుచుకున్నా కానీ పుట్టలేదు.

పురు : అందుకని ?

పర : పరిస్థితులిన్నబట్టి గడువు కోరాడు.

పురు : అదిచాలదూ ? పైగా నోట్సు వ్రాస్తాడుట నోటు !

వెంక : బెట్టుగా వ్రాయించుకుంటే సరిపోదూ ?

పురు : (వెటకారంగా) ఏం చేసుకుంటాం ? కనీసం నాలుగ్గీసు కోటానికైనా పనికిరాదు.

పర : నాకు ఉభయులూ ఒక్కటే ! నామాటకూడా కొద్దిగా వినండి.

పురు : ఏమిటయ్యా వినేది? (వెంక టేశం లోపలకు వెడతాడు)

పర : ఆయన రెక్కలాధారంగా బతికేవాడు. ఒక్కసారిగా అయిదువేలు పుట్టాలంటే మాటలా ? అక్కడికీ తంటాలు పడుతూనేవున్నాడు.

పురు : అవన్నీ నాకనవసరం. పుట్టికెగర లేనమ్మ స్వర్గాని కెగిరినట్లు తాహతు లేనివాడు తగుదునమ్మని ఆకట్నం యివ్వటానికి యెందుకు వప్పుకున్నాడు ?

పర : అంతకంటె గత్యంతరం లేకపోతే యేంచేస్తాడు ?

పురు : గంతకుతగ్గ బొంత అన్నట్లు తాహతకుతగ్గ సంబంధమే వెతుక్కోవాలి.

పర : వెతికాను. వెతికి వెతికి వెర్రివాడైనాను. చూడబోతే ఆడపిల్లను కన్నతండ్రి.

పురు : ఆయనకు ఒక్కతే ఆడపిల్లయితే నాకు ఇద్దరున్నారు. వుంటే?

పర : ఈడొచ్చిన పిల్లను యెంతకాలమని యింట్లో పెట్టుగు నుంటాడు చెప్పండి!

పురు : అందుకని?

పర : ఈ నా హస్తంమీద మీ సంబంధం కుదిర్చాను. నిజానికి నా బలవంతంమీదనే మీతో వియ్యానికి అంగీకరించాడు. మీకుర్రవాణ్ణి చేసుకోమని ప్రోత్సహించింది నేను.

పురు : (హేళనగా) ఏం? మావాడికి పెళ్ళికాదనా!

పర : అహాహా! యెంతమాట! మీకుర్రవాడికి పెళ్ళి కావటానికేం? బంగారంలాగా అవుతుంది. యిది కాకపోతే దీని తలతన్నిన సంబంధం మరొకటి!

పురు : మరి ఆయన్ని నిర్బంధించటానికి కారణం?

పర : వాళ్ళమ్మాయి సుఖపడుతుందనే మీ సంబంధం ఈ నా హస్తంమీద కుదిర్చాను. కుర్రవాడు బియ్యే చదివాడు, బుద్ధిమంతుడు, అందంగావుంటాడు, చిన్న వయస్సు అని ఆపెద్దమనిషిని పురికొల్పాను. నామాట కాదనలేకపోయాడు ఆయన పురుషోత్తంగారూ! మీరు పెద్దలు. అన్నీ తెలిసిన అనుభవజ్ఞులు. అను

కున్నది అనుకున్నట్లుగా జరక్క ఆలశ్యమైందన్న కోపంతో అవమానించడం బాగుళ్ళేదు ! నాకు ఉభయులూ ఒక్కటే. అందులో ఈ నా హస్తంమీంద కుదిర్చిన సంబంధమని కోరుతున్నాను. నామాటవిని ఒకటి రెండురోజులు గడువిస్తే... ...

పురు : (సిర్హోహామాటంగా) రెండు నిముషాలుకూడా ఇవ్వను.

పర : (దీనంగా) పురుషోత్తంగారూ !

పురు : నాపట్టుదలే అంతే.

పర : అలాఅనకండి. నామాట ... ...

పురు : ఎవరిమాటా వినను.

పర : ఆయన యివ్వకపోతే నేనిస్తాను.

పురు : ఆఁ! ఆఁ ! నువ్విస్తావ్, మేం పుచ్చుకుంటాం. రెండూ నిజమే. మూడుముళ్ళూ పడేవరకూ ఇలా చాలామంది మాట్లాడతారు. ఇదిగో! పరమేశంగారూ! చిన్నప్పటి నుంచి పెంచి పెద్దచేసి వేలకువేలు గుమ్మరించి బియ్యే వరకూ చదివించింది పూటకు ఠికాణాలేని బీదపిల్లను చేసుకోటానికి కాదు.

పర : అని నేనన్నానా ?

పురు : మీరేమన్నాసరే! మీదృష్టిలో నన్నొక దుర్మార్గుడుగా చూసినాసరే! కట్నంలో కానీ తక్కువ యిచ్చినా ఈపెళ్ళి జరగదని సీతయ్యగారితో చెప్పండి.

పర : ఇంత పట్టుదల కూడదండి. (రెంకటేశం లోపలనుంచి వస్తాడు) ఏదో పేదవాడు. విసుగూ విరామంలేకుండా తిరుగుతూనే వున్నాడు.

పురు : తిరక్కుండా యింట్లో కూర్చుంటే పెళ్ళవుతుందా ? యెవరి పనికోసం వాళ్ళు తిరగటంలో గొప్పేముంది ?

వెంక : అదికాదు మామయ్యా !

పురు : ఏదైనా ఈవిషయంలో నీకేం తెలియదు వెంకటేశం.

పర : (వెంకటేశంతో) కాదండీ ! అయిదువేల రూపాయల కట్నం నిల్చున్నపాలాన్ని నిల్చున్నట్లు తెమ్మంటే యెక్కణ్ణుంచి తెచ్చిపోస్తారండీ !

పురు : (వెటకారంగా) ఆ తాహతలేనివాడు పెద్దోస్తు వాళ్ళతో పొత్తుకోసం యెందుకు ప్రాకులాడాలండీ ! (కోపంతో చీదరింపుగా) వెనకాముందూ ఆలోచించుకోవక్కర్లా? ఆ స్వల్పకట్నం యివ్వటానికి ఆనాడు అంగీకరించి యీనాడు మోసంచేస్తాడా ? పెద్దమనిషి !

పర : ఇందులో మోసమేముందండి ?

పురు : అంతామోసమే ! యీవేషాలకేంలే !

వెంక : మామయ్యా ! ముందుస్థితిని గుర్తించి స్థాయిగా మాట్లాడుకుంటే బాగుంటుంది. వీరూ వారూ లేని మాటల్తో తగాదాకిదిగక జరగవలసిన కర్తవ్యాన్ని గురించి ఆలోచించడం మంచిది. (పరమేశంతో) చూడండి పంతులుగారూ ! పెళ్ళికుమార్తె తండ్రి గారికి యేముద్యోగం ?

పర : సీతయ్యగారికాండి ! ఒక లఘోధికారిదగ్గర ... ...

పురు : (హేళనగా) యీ భిక్షాధికారి గుమాస్తాట !

వెంక : (మందలింపుగా) మామయ్యా ! పగవాడైనా మర్యాదిచ్చి మాట్లాడాలి.

పర : అంటే అన్నారులెండి. వారు అనతగినవారు. సీతయ్య గారు పడతగినవారు.

వెంక : (పరమేశాన్ని అదోలా చూస్తూ) అంతేలెండి. నన్నడుగుతే మీ సీతయ్యగారు చాలా పొరపాటుపని చేశారు.

పర : ఆఁ!

వెంక : వంద కాదు, రెండువందలు కాదు. ఆలోచన లేకుండా అయిదువేలు ... ...

పర : ఇస్తాననటానికి మరో కారణంవుంది.

పురు : (స్థాయిగా) ఏమిటది!

పర : తనకుమార్తె వివాహానికి సహాయపడవలసిందిగా అధికారిని కోరాడు. ఆయనమీదుండే అభిమానంకొద్దీ ఆ అధికారి సరేనని అంగీకరించాడు. తీరా సమయానికి ... ...

పురు : ఇవ్వననాన్నడా ?

వెంక : (మందలింపుగా) మామయ్యా !

పర : వారి అదృష్టానికి తగ్గట్టు అన్ని అవాంతరాలూ అనుకోకుండానే వచ్చాయ్. ఆశచూపిన లక్షాధికారికి ఏదో పనుండి తలవని తలంపుగా పట్నం వెళ్ళాడు. (జాలిగా) అక్కడికీ పాపం ప్రయత్నిస్తూనే వున్నాడు.

పురు : మీ రెన్నన్నా చెప్పండి. మాతో బంధుత్వం కలుపుగోవాలంటే, మాకుర్రవాడితో వివాహం జరగాలంటే తల తాకట్టుపెట్టయినాసరే, ముహూర్తానికి ముందర మాడబ్బు మాకివ్వాల్సిందే! అలా జరపకపోతే నేనిరాజీపడం లేదు.

పర : అంతేనా ?

పురు : అనే విస్పందేహంగా చెప్తున్నాను. అరగంటలో మాకేసంగతీ చెప్పాలి. దీనికేమాత్రం భిన్నంజరిగినా మేం వెళ్ళిపోతాం.

పర : (నిట్టూర్చి) వస్తా. (వెళ్ళబోతాడు. పురుషోత్తం లోపలకు వెళ్ళబోతాడు.)

వెంక : పంతులుగారూ ! (పురుషోత్తం ఆగి వాళ్ళమాటలు వింటాడు.)

పర : (ఆగి) ఏమిటండి !

వెంక : మీరుకూడా ప్రయత్నించి యేదోవిధంగా అల్లరి కాకుండా మానుముఖ్యా పడేవిధానం చూడండి !

పర : విఘ్నేశ్వరుడి దయుండాలి. (బయటకు వెడతాడు. పురుషోత్తం లోపలకు వెళ్ళబోతాడు.)

వెంక : పురుషోత్తముని చూస్తూ) మామయ్యా !

పురు : (ఆగి) ఏం ?

వెంక : ఇంత మూర్ఖప్పట్టుదల వుండకూడదు.

పురు : ఇది వ్యవహారం. ఆహారంపట్ల, వ్యవహారంపట్ల మొహమాట ముండకూడదు వెంకటేశం !

వెంక : దూరం ఆలోచించే మాట్లాడుతున్నావా ?

పురు : అంటే !

వెంక : ఒకవిధంగా ఆలోచించిచూస్తే ఈ నీ పట్టుదల మన పరువు ప్రతిష్టలక్కూడా మచ్చ తీసుగొస్తుందేమో !

పురు : ఏవిధంగా ?

: పీటలమీద పెళ్ళిపడిపోతే మళ్ళీ వాసుకీజన్మలో పెళ్లావుతుందా ?

: ఎందుకావ్వదు ? వలభై యెకరాల భూస్వామి, పెద్ద మండువాయిల్లు, రెండుతోటలు ... ...

: వుంటే ?

: పిల్లనివ్వటానికిగాని, పెళ్ళికావటానికిగాని ఆక్షేప ణేముంది ? నిక్షేపంగా అవుతుంది.

: (హేళనగా) హుఁ ! అవుతుంది. ఒళ్ళుతెలియని ఆవేశంలోపడి వాడి భవితవ్యాన్నే మర్చిపోయావ్. సిరిసంపదలు వున్నంతమాత్రాన సాంప్రదాయ సిద్ధాంతాలకు విరుద్ధంగా ఆడపిల్లలుకల యేతండ్రీ తన కూతురు సుఖాన్ని చేతులారా నాశనం చేయలేడు, చేయడు. దేనికైనా మంచిచెడుగులుంటాయ్ !

: నాకు తెల్సు నువ్వేం చెప్పక్కర్లేదు. అప్రయోజకుల చెప్పినమాటల్నే ఆధారంగా తీసుకొని యెవరూ పిల్లనివ్వకపోతే బ్రహ్మచారిగానే వుండిపోతాడు.

: ఈ మాటలు నువ్వానాల్సిన మాటలుకాదు. తన పుత్రుడు క్షేమంకోరి అతని భవిష్యత్తు కోసమే అహర్నిశలూ ఆరాటపడే యేతండ్రీ యింతమాట అన్లేడు. యిలా ఆశీర్వదించటానికేనా వాణ్ణి పెంచి పెద్దచేసింది ! నీకళ్ళయెదుటే వాడు బ్రహ్మచర్యా మవలంబించాలనే అభిలాష నీకుంటే అలాగేకానియ్.

: వెంకటేశం ! యింకా నీకు ప్రపంచజ్ఞానం తెలియదు.

వెంక : (దెప్పుతున్నట్లుగా) అవును. నీకు తెలిసినంతగా నాకు తెలియకపోవచ్చు. స్వార్థం మానవకల్పితమైన కులాల్లోనూ, సంఘాల్లోనూ కుక్క-గొడుగుల్లాగ లేచే కుళ్లుని కూకటి వేళ్ళతో పెకల్చాలని ప్రయత్నించటం మంచిదికాదని యెంచకు! కట్నందగ్గర పేచీవచ్చిందని కత్తికట్టి దీక్షతో కన్నకొడుకు సుఖాన్ని కాళ్ళరాసు టము బాగుళ్ళేదు. ఫలితంగా కోరి తలవంపులు తెచ్చుకోవాల్సివస్తుంది. నలుగుర్లోనూ తలెత్తుకు తిరిగే యోగ్యత లేకపోయినాక ఆ స్త్రీవుండి ప్రయో జనంలేదు.

పురు : నీధర్మపన్నాలు నాకనవసరం. యిది నాస్వవిషయం. ఇందును గురించి విమర్శించటానికి యెవ్వరికీ హక్కు లేదు.

వెంక : నాకుంది.

పురు : ఏవిధంగా ?

వెంక : నీఅల్లుణ్ణిగనుక !

పురు : అయినందుకు యెంతవరకుండాలో అంతవర కేవుండు.

వెంక : వున్నాను కాబట్టే నీకీసలహా యిచ్చాను. పరాయి వాళ్ళయ్యేసరికి గుట్టుని పట్టుదలతో కప్పి జట్టీకి సిద్ధ మయ్యావుగాని, ఆనాడే ఈ పట్టుదల మాదగ్గరుంటే యేమయ్యేది ?

పురు : ఏమిటది ?

వెంక : నువ్వు నాకు కట్నం యిస్తానన్లేదూ ?

పురు : అంటే ?

వెంక : ఇచ్చావా ?

పురు : చేతనైతే తీసుగోలేకపోయావ్ ?

వెంక : నీఅంత మూర్ఖత్వానికి దారితీయలేక అయినవాడివని అభిమానం చూపించాడు మావాన్న ! మేనల్లుడనని మాటల్లోనే మైమరపించావ్ నువ్వు నన్ను. అప్పుడే మేమూ పట్టుపట్టినట్లయితే ?

పురు : (స్థాయిగా) వెంకటేశం ! యిప్పుడు జరగబోయేది వాసుపెళ్ళి. గతాన్ని గురించి ఆలోచించటానికిగాని, వాదించటానికిగాని నాకు తీరిక లేదు.

వెంక : అంతేనా ?

పురు : అంతేకాదు నాయిష్టానికి అయిష్టంగా, నాఆశయాలకు విరుద్ధంగా ప్రవర్తించి, నామనస్సుకి కష్టం కలగ చేయాలన్న దృక్పథంతో ప్రయత్నించేవాళ్ళమాట విననని స్పష్టంగా చెప్తున్నాను. (నిట్టూర్చి) తన సుతుడు ప్రయోజకుడు కావాలని, పెద్దకట్నం తీసుకు రావాలని సుతులనుకన్న ప్రతీతండ్రికీ వుంటుంది వెంకటేశం !

వెంక : వుండచ్చు. యేతండ్రీ ఇంత దుర్మార్గంగా ప్రవర్తించడు.

పురు : సన్మార్గం పాటించడం చేతకానివాళ్ళకు దుర్మార్గమే చంపపెట్టు.

వెంక : ఎంతచెప్పినా నీమనస్సుకి యెక్కడంలేదు. సునాయాసంగా వేలు సంపాదించాలన్న వెర్రి అపేక్ష నీచేత యిలా మాట్లాడిస్తోంది. పెద్దవాడివి ! ఒకళ్ళకు నీతి చెప్పాల్సిన నువ్వే మతిబోయి మాట్లాడుతున్నావ్.

పురు : మధ్య నీతో పోట్లాడాల్సిన అవసరం నాకులేదు.

వెంక : వుంటే యిలా యెందుకు ప్రవర్తిస్తావ్ ! మేనల్లుడనని, మీాయింటల్లుడనని, మీాకుటుంబ మంచిచెడ్డలు గమనించాల్సిన కర్తవ్యం నామీాదకూడా వుందనుకొని భ్రమించాను. నీపట్టుదలచూచి బాధపడ్డాను. అయిన వాళ్ళమైనప్పటికీ మీాతరహా యింతవరకూ తెల్సుగో లేక అల్లుడననే ఆశకొద్దీ అజ్ఞానంతో సలహాయిచ్చాను. క్షమించండి. వ్యక్తిత్వంలేని నీవంటివాళ్ళతో పోట్లాడే కన్న మాదార్ని మేము వెళ్ళటం మంచిది. (నమస్కారంచేసి) వస్తా ! (వెళ్ళబోతాడు)

పురు : వెంకటేశం !

వెంక : (ఆగుతాడు.)

పురు : ఎందాకా ?

వెంక : మావూరు.

పురు : ఆలోచించే వెళుతున్నావా ?

వెంక : అన్నీ తెలిసిన పెద్దవాళ్ళే దానికి స్థానం యివ్వలేదు.

పురు : ఇదే నీసమాధానమా ?

వెంక : అవటంలో పొరపాటులేదు.

పురు : వెళ్ళాల్సిందేనా ?

వెంక : పట్టుదల అనేది అందరికీ ఒక్కటే ! నేను ఒక్కణ్ణే వెళ్ళటంలేదు. మీాఅమ్మాయి సరోజతోసహా వెళుతున్నాను.

పురు : (ఆవేశంతో) వెళ్ళండి. నన్ను అవమానించటమే లక్ష్యంగా పెట్టుగోతల్చుకుంటే వెళ్ళండి.

వెంక : ఆదరించటం చేతకాని వాళ్లు అవమానించ కేంచేస్తారు ? బావమర్ది పెళ్ళికి భార్యాసమేతంగా వచ్చానుకాని, మీ మీ తగాదాల మధ్య తలదూర్చి తలవంపులు తెచ్చుకోటానికి రాలేదు సెలవ్ ! (బయటకి వెళ్ళ బోయి క్షణం ఆలోచించి లోపలకు వెడతాడు. ఆదార్నే వాసువచ్చి లోపలకు వెళుతున్న వెంక టేశాన్ని అదోలాచూసి పురుషోత్తంని చూస్తాడు.)

పురు : (వాసుని చూడకుండానే) వెళ్ళండి. అంతా వెళ్ళండి. మీ బెదిరింపులకుజడిసి మీకు వంగివుంటాననిమాత్రం తల్చకండి. మీచచ్చుఆశయాలకోశం మీఅసభ్యపు కోరికల్ని ఆచరణలో పెట్టి అయినదానికీ కానిదానికీ తలూపటానికి నేనేం గంగిరెద్దును కాదని గ్రహించండి. (గర్వంతో విశ్రాసం సవరించుకుంటాడు.)

వాసు: (మామూలుస్థాయిలో) నాన్నా !

పురు : (స్థాయిగా) ఏం ?

వాసు: కట్నమిచ్చినా లేకపోయినా ఆపిల్లనే పెళ్ళి చేసు కుంటాను.

పురు : (మందలింపుగా) వాసూ !

వాసు: అవును నాన్నా !

పురు : ఆలోచించే అంటున్నావా ?

వాసు: అంగీకరిస్తారని ఆశిస్తున్నాను.

పురు : అదేం లాభం లేదు. మనకున్న ఆస్తిపాస్తులకు, పరువు ప్రతిష్టలకు, కూటికి లేని కటిక దరిద్రుడు కూతుర్ని కట్నంలేకుండా చేసుకుంటావుట్రా! నువ్వీదారుణానికి

దారితీస్తే మనగౌరవం యేంకావాలి? పేదపిల్లకు పుస్తెకట్టి దాంతో తలెత్తుగు కాపురం చేస్తానికి ముందడుగేస్తున్న నీవింతనైఖరి నాకు చాలా చిన్న తనంగావుంది వాసూ!

వాసు: పేరుకి పేదవాళ్ళు కావచ్చు. అయితేనేం? అందానికి అందం, గుణానికి గుణం వుంది.

పురు : (గర్వంగా) అంతకంటే వెయ్యిరెట్లు అందగత్తెను, గుణవంతురాల్ని తీసుకొస్తాను. ఒక్కగాని ఒక్క కొడుకువి. నా ఆశలన్నీ నీమీదనే పెట్టుకున్నాను. అవన్నీ నిరాకరించి ఒకదరిద్రుడికి అల్లుడుగా......

వాసు: విన్లేను నాన్నా! సిరివున్నా లేకపోయినా సాంప్రదాయంకల కుటుంబమని......

పురు : వెంకటేశం చెప్పాడు కాదూ? (వెంకటేశం లోపల నుంచి బయటకి వెడతాడు.)

వాసు: ఎవరు చెప్పినా ఆ అమ్మాయినే చేసుకుంటాను.

పురు : (పెద్దగా) వాసూ! ముందుస్థితిని గుర్తించక యితరుల మాటల్నే ఆధారంగా తీసుకుంటే నిలువ నీడలేకుండా అవస్తలు పడాల్సివస్తుంది. యీనాడు నీకు సలహాలిచ్చినవాళ్ళు ఆనాడు నిన్ను వాళ్ళ పంచక్కూడా చేరనీయరు. దూరం ఆలోచించుకో.

వాసు: అదికాదు నాన్నా! (యేదో చెప్పబోతాడు.)

పురు : ఏదైనా వినను. నీవివాహం నాయిష్టంమీదనే జరిగి తీరాలి. యేమాత్రం భిన్నంగా ప్రవర్తించినా నాఆస్తిలో చిల్లిగవ్వకూడా దక్కదు. అంతేకాదు,

(విచారంగా) ఆనాటినుంచీ నీకూ నాకూ మధ్యవున్న తండ్రీ కొడుకుల సంబంధమే తెగిపోతుంది.

వాసు: (విస్మితుడై) నాన్నా !

పురు : ఆ పదాన్ని వుపయోగించుకోవాలన్న అభిలాష, అర్హత నీకుండాలంటే నాయిష్టానికి అయిష్టంగా ప్రవర్తించకు.

వాసు: (పురుషోత్తముని యెగాదిగాచూసి) క్షమించండి నాన్నా ! (బయటికి వెళ్ళబోతాడు.)

పురు : (స్థాయిపెంచి) ఆగు !

వాసు: (ఆగుతాడు.)

పురు : వాళ్ళింటికేనా ?

వాసు: అవును.

పురు : నామాట వినదల్చుకోలేదా ?

వాసు: ఈ విషయంలోమాత్రం... ...

పురు : ఆమాటేఖాయమా ?

వాసు: (మాట్లాడడు.)

పురు : (స్థాయిపెంచి) మాట్లాడవేం ?

వాసు: అయిదువేలకోసం అయినవాళ్ళకు దూరమై అల్లరి పడడం నాకిష్టంలేదు.

పురు : నాకు కష్టంగావున్నా కట్నంలేకుండానే కళ్యాణం జరుగుతుందిగా !

వాసు: అవును.

పురు : నాఆస్తితో నీకు సంబంధంలేదుగా !

వాసు: లేకపోయినాసరే.

పురు : (ఉలిక్కిపడి ఆశ్చర్యంగా) ఆఁ! ఎంతమారిపోయావ్ ?

వాసు: సరోజకూడా వెళుతోంది. ఆడపడచు కన్నీటితో గడపదాటటం మీకు క్షేమంకాదు.

పురు : ఆ జ్ఞానం వాళ్ళకుండాలి. అంతేగాని, ఆడపడుచు మీదుండే అభిమానంకొద్దీ పెంచి పెద్దచేసిన తండ్రికి వంచనచేస్తావా ? నిన్ను దృష్టిలో పెట్టుకుని యెన్నో ఆశాసౌధాలు నిర్మించుకున్నానే ! అవన్నీకూల్చి నాకోర్కెలు తృణీకరిస్తావా ! నీకు సిగ్గులేదూ ? ఆడ పడుచు వెళ్ళిపోతుందనే అదురుతో బెదిరి ఆ స్తిపాస్తుల్ని విసర్జించి, కన్నతండ్రిని కాదని, అవస్థల పాలవు తావుట్రా భ్రష్టుడా ?

వాసు: ఏ శుభకార్యానికైనా అందరూవుంటేనే ఆనందం.

పురు : (స్థాయిగా) వాసూ !

వాసు: మీకు వ్యతిరేకించి ప్రవర్తిస్తున్నానని బాధపడకండి. వస్తా (బయటకు వెళ్ళబోతాడు.)

పురు : (నిట్టూర్చి) ఆఁ! ఒక్కమాటవినిపో వాసూ ! (సమీ పించి) నీసంతోషంకంటే నాకు కావలసింది లేదు. నేను చేసిందికూడా పొరపాటుకాదు. ఆదినుంచి వస్తున్న ఆచారాల్ని అనుసరించి కట్నంకోరాను. ఆనాడు నీకు యిష్టమైనా యీనాడు వ్యతిరేకించావ్. చెప్పినమాటలువింటే యేవ్యక్తిలోనైనా మార్పు వస్తుంది. యెవరో ఒకళ్ళు తగ్గకపోతే యెలాగు ? నీయిష్టప్రకారం కట్నంలేకుండా ఆ పిల్లనే పెళ్ళి చేసుకో వాసూ !

వాసు: (ఆనందంతో కూడిన ఆదుర్దాతో) నిజంగానా నాన్నా!

పురు : నమ్మ లేకుండా వున్నావా నాయనా !

వాసు: నాన్నా ! (యిద్దరూ కౌగలించుకుంటారు.)

పురు : కాని, ఒక ప్రశ్నకు జవాబు యివ్వాల్సిన బాధ్యత నీమీదుంది.

వాసు: అడగండి నాన్నా !

పురు : నీకోసం చేసిన అప్పు తీర్చే విధానమేమిటి ?

వాసు: (అర్థం కానట్లు) నాకోసం అప్పు చేశారా !

పురు : నీకు తెలియదా ?

వాసు: తెలుస్తే యెందుకడుగుతాను ?

పురు : అప్పు చేసినట్లు తెలియదు. చెప్పుడు మాటలు విని తండ్రిని యెదిరించటం మాత్రం తెలుసును. అయినా అప్పు చేయాల్సిన కారణం, చెప్పాల్సిన బాధ్యత నామీదుంది. చెప్తున్నాను విను. నిన్ను పెంచటానికి గాని, నీ చదువులకు గాని వేలకు వేలు అప్పు చేశాను. దాన్ని రద్దు చేయాల్సిన కర్తవ్యం నీమీద వుంది.

వాసు: నామీదనా ? (తెల్ల బోతాడు.)

పురు : లేకుంటే యెవరు తీరుస్తారనుకున్నావ్ ? యెలా తీరుస్తారనుకున్నావ్ ?

వాసు: అప్పు చేయమని చెప్పానా ?

పురు : చెప్పినా చెప్పకపోయినా చేయాల్సిన బాధ్యత వుండి చేశాను. తీర్చాల్సిన బాధ్యత నీమీదుంది.

వాసు: ఎలా తీర్చమంటారు ?

పురు : నీకు సలహా లిచ్చేవాళ్ళనవసరంలేదు. నాకు కావలసింది చేసిన ఋణం తీర్చటం. అది ముందు చేసి తర్వాత ఆ పిల్లను పెళ్ళిచేసుకో.

వాసు: దానికీ దీనికీ సంబంధమేమిటి ?

పురు : కావల్సినంతవుంది. బాకీతీర్చటానికే కట్నంకోరాను. కట్నండబ్బుతో తీర్చచ్చునన్న అభిప్రాయం వుండబట్టే ఋణంచేసి నిన్నొక వ్యక్తిగా తయారుచేశాను. అంచేత బాకీతీర్చినాసరే! నామాటవిన్నా సరే! (వాసు పురుషోత్తంని అదోలాచూసి బయటికి వెళ్ళబోతాడు) సమాధానం యివ్వకుండా వెళ్ళినట్లయితే నీకళ్ళయెదుటే యేవిషమో త్రాగి మరణిస్తాను.

వాసు: (ఆగి) నాన్నా !

పురు : నాన్న ! నాన్నమీద అభిమానం లేకపోయాక ఆనాన్న బ్రతికినా ఒకటే. చచ్చినా ఒకటే. ఆలోచించుకోని వెంటనే నాకేసంగతీ చెప్పు. (స్థాయిగా) మళ్ళీ నీకు గుర్తుచేస్తున్నాను. ముందు బాకీ తీరుస్తేనే కట్నంలేకుండా పెళ్ళాడు. లేదా నామాట విను. అదంతా నేను చూసుకుంటాను. ఈ రెండింటి లోనూ యేదోవొకటి జరపకపోతే వుండనేవుంది బలవన్మరణం. తనపుత్రుడే తనకు తలవంపులు తెచ్చాక ఆ తండ్రికి యింతకంటే కోరేదివుండదు. చెప్పువాసూ !

వాసు: (పొంగి పొర్లే దుఃఖంతో) క్షమించండి నాన్నా !

పురు : (ప్రేమగా భుజంతట్టి) విచారించకు వాసూ! ఇతరుల బెదిరింపులకు అదిరి తొందరపడ్డావని నాకు తెలుసు.

(వాసు అక్కడవుండలేక లోపలకు వెడతాడు. బయటనుంచి దాసువస్తాడు. వాసు వెళ్ళినమార్గం చూస్తూ) తలా తోకాలేని యిటువంటి తప్పుడు సంబంధం ... ...

దాసు: ఏది తప్పుడు సంబంధం? ఎవరు తప్పుడు పనులు చేసేది?

పురు : (దాసుని చూస్తూ) ఎవ్వరునువ్వు?

దాసు: ఒకనిర్భాగ్యుని కొడుకుని. ఒకఅభాగ్యురాలి అన్నను.

పురు : నీరాకకు కారణం?

దాసు: దారుణంగా ప్రవర్తించేవాళ్ళల్లో దయనేది వుందేమో చూడటానికి! నేను ... ...

పురు : పెళ్ళివారితాలూకా?

దాసు: పెళ్ళికూతురు అన్ననని ముందే మనవిచేశాను.

పురు : కట్నండబ్బు సిద్ధంచేశారా?

దాసు: పట్నంవెళ్ళిన లక్ష్మాధికారి రావద్దూ? మాపరిస్థితి యెటూగాకుండావుంది మీలోదయనేది యేమాత్రం వున్నా మమ్మల్ని క్షమించి ఏదోవిధంగా ముహూర్తం జరిపించండి. యెటూతోచక కుళ్ళి కుళ్ళి యేడుస్తున్న మానాన్నను చూసనా్నా కనికరించండి. మీకాళ్ళు పట్టుకు ప్రతిమిలాడుకుంటాను.

పురు : (హేళనగా) యిది చెప్పటానికేనా తమరొచ్చింది? ఒప్పుకున్నపైకం ... ...

దాసు: యిచ్చేవరకూ మాయిల్లు తనఖా వ్రాయించుకోండి.

పురు : (ఎక్కిరింపుగా) తనఖా ! ఆ తనఖా మరొకరి పేర వ్రాసి మీమాట నెగ్గించుకోండి. అంతేగాని, అటువంటి పనికి నేను అంగీకరించను.

దాసు: దయచూపలేరాండి ?

పురు : నావల్ల కానిపని. నాచుట్టూ పదేపదిసార్లు తిరిగి నన్ను విసిగించేకంటే మీ ప్రయత్నంలో మీరుండటం మంచిది.

దాసు: ఇలా అంటారని తెల్సును. తెలిసే అడిగిపోదామని వచ్చాను.

పురు : వచ్చినదారినే వెళ్ళచ్చు.

దాసు: వియ్యమనేవంకతో కయ్యానికి కాలుదువ్వటానికి సిద్ధంగావున్న మీకు మామాటలు వినిపించవు.

పురు : సమయంకాని సమయంలో యేమిటినీవాదన ?

దాసు: వాదనకాదు మహాశయా ! ఒక పేదవాడి రోధన !

పురు : అర్థమైంది నీఆవేదన ! వ్యర్థ ప్రసంగానికి దారితీయక మర్యాదగా వెళ్ళు.

దాసు: మీరు మగపెళ్ళివారు. మీరేదన్నా చెల్లుబాటవుతుంది. అయినాసరే ! మాకష్టసుఖాలు గుర్తించి అనుకున్న శుభకార్యాన్ని అల్లరికాకుండా జరిపించమని యాచిస్తున్నాను.

పురు : (యీర్షగా) యాచిస్తావ్ ! "దరిద్ర పెద్దమ్మలకు ధర్మప్రన్నాలు మెండు" అన్నట్లు... ...

దాసు: (స్థాయిగా) మామగారూ !

పురు : (పళ్ళుకొరుకుతూ) మామగారు! యిక్కడ నీకు మామగారూ, అత్తగారూ యెవరూ లేరు. యిప్పటికే చాలా పశ్చాత్తాప పడుతున్నాను. మీకుటుంబ పరిస్థితి యీ విధంగా వుంటుందని తెలిసుంటే అసలీ సంబంధానికే అంగీకరించేవాణ్ణికాదు.

దాసు: అంతటి మహోపకారమే మీరు చేసివున్నట్లయితే యీనాడీవిధంగా యాచించాల్సిన అవసరమే వుండేది కాదు.

పురు : గతిగడవనివాళ్ళకు మతిలేనిమాటలు బాగావస్తాయ్.

దాసు: సంపాదనే లక్ష్యంగా పెట్టుకొని సలక్షణంగా సాగి పోతున్న సంసారాన్ని స్మశానాలుగా మార్చే వాళ్ళకు యెలాంటిమాటలు వస్తాయ్?

పురు : నీవంటి పరువుతక్కువవాళ్లు పనికిమాలిన ప్రశ్నలకు జవాబు యివ్వాల్సిన అవసరం నాకు లేదు.

దాసు: పరువుగల తమలాంటి పెద్దలు యితరుల్ని యేడ్పించటంకూడా తగినపనికాదు. దయవుంచి నామాట వినండి పురుషోత్తంగారూ!

పురు : ఇతరులమాట వినటమనేది నాజాతకంలోనేలేదు.

దాసు: వుంటే యింతవరకూ యెలావస్తుంది? ఎదటవాడి కష్టసుఖాలు గమనించలేక ... ...

పురు : ధనార్జనే నాజీవిత సాధనంగా యెంచాను. సరేనా?

దాసు: మనఅన్నం మనంతిన్నా లోకానికి పెరవాలని తెల్సుకోండి.

పురు : నీసోకులు వింటానికిది సమయంకాదు.

దాసు: ఎదటివాడికి మేకులు చెక్కటానికే యిదసమయం. యెవరికైనా యింత మొండిపట్టుదల వుండకూడదు పురుషోత్తంగారూ! కట్నాలు యివ్వటంలో తాహత వున్నవాళ్ళూ వుంటారు లేనివాళ్ళూ వుంటారు.

పురు : వుండచ్చు. మాకుర్రవాడికి పిల్లనివ్వమని మేము కోరలేదు. మీరే ఆ పరమేశంద్వారావచ్చి ప్రాధేయ పడ్డారు. మాతో చుట్టరికం కల్పుగోటమే ముఖ్యంగా యెంచుకున్నారు. అయిదువేలూయిచ్చి లాంచనాలన్నీ యధావిధిగా జరపాలని ఆనాడే అన్నాను యిస్తానని యెందుకు మాటివ్వాలి? యిప్పుడీవిధంగా యెందుకు మడతపేచీ పెట్టాలి?

దాసు: పూచీలేని పేచీలకుదిగింది మీరు. కట్నం... ...

పురు : అనేపదం యీనాడు నేను సృష్టించిందికాదు. అది తరతరాలుగా వస్తున్న ఆచారం! అదివుంటేనే గౌరవం! అది తీసుకోనివాడిముఖం చూడకూడదు. దాన్నికాదని ధిక్కరించటానికి యెవ్వరికీ యేవిధం గానూ హక్కులేదు. యీ వరకట్నమనే సమస్యకు నేనేకాదు మొగపిల్లలుకల ప్రతితండ్రీ తలవంచి తీరుతాడు.

దాసు: పురుషోత్తంగారూ! (యేదో చెప్పబోతాడు)

పురు : ఇంతవరకూ నువ్వు చెప్పిన దానికంటే ముందు చెప్ప బోయేదాంట్లో నేను వినాల్సింది యేమీలేదని నాకు తెల్సును. నీఅంతరంలోని మాటకు బదులుగా మళ్ళీ

జవాబు చెప్తున్నాను. వివాహం జరగాలంటే డబ్బిచ్చి తీరాలి.

దాసు: అమాటే ఖాయమా ?

పురు : వేరే చెప్పాల్సిన అవసరంలేదు.

దాసు: మీలో దయనేది మాసిపోయింది. జాలనేది నశించింది. మీరు మీ జీవితంలో కావాలనికోరి పూజించేది ఒక్కటే! డబ్బు. దానికోసమే మీరు సృష్టించ బడ్డారు! దానికోసమే మీరు జీవిస్తున్నారు! దాని కోసమే ఎటువంటి దారుణాలకైనా దారితీస్తున్నారు! పురుషోత్తంగారూ! సిరిసంపదలు అశాశ్వతమైనవి. యివ్వాళ వుండచ్చు. రేపుపోవచ్చు. వున్నా బ్రతికున్నంతవరకే కంటికి కనుపిస్తాయ్. యీ నగ్న సత్యం అనుభవశాలురు, ఆశావాదులు అయిన మీకు తెలియున్ది కాదు.

పురు : (హెచ్చరికగా) ధోరణి మితిమీరుతోంది.

దాసు: కారణం మీ ప్రవర్తనే. కాదని అనగలరా ? ఆచార మంటూ ఆరంభించి అంతరంలో ఆర్జించటమే ఆశయంగా ఎంచి ఆడపిల్ల పెళ్ళిచేయాలనే అభిలాష గల ఒక అమాయకుడు కంఠాన్ని అడక త్తెరలోపెట్టి అనరానిమాటలూ అనటం అనుకున్నంత మంచి పనికాదు.

పురు : (నిర్లక్ష్యంగా) యీ వాజమ్మ కూతలకేంలే !

దాసు: మీరు ఎలాంటి ఘోరాలు చేసినా తప్పులేదు. మీరు చేస్తున్న అక్రమాల్ని, అన్యాయాల్ని చూసి, సహించి మీ పాటకు వంతపాడుతుంది సంఘం.

పురు : (కోపంతో) హుం! (లోపలకు వెళ్ళబోతాడు)

దాసు: మాట్లాడుతుంటే వెళ్ళటం పెద్దమనిషి తరహా అను కుంటాను. పురుషోత్తంగారూ! మీకూ ఆడపిల్ల లున్నారు. వాళ్ళనూ ఒకయ్య చేతుల్లో పెట్టుంటారు.

పురు : (కోపంతో) పెట్టాను. మీఅంత నీచంగా యేపిల్ల పెళ్ళివిషయంలోనూ ప్రవర్తించలేను.

దాసు: కలిగినవాళ్ళు కనుక ఆ యిబ్బంది లేకపోయింది. మా యీ పేద స్థితిలోనే మీరుండి, మీ పిల్ల పెళ్ళికే యిలాంటి అవాంతరాలువస్తే యేంచేస్తారు?

పురు : మెడమీద కత్రేసి గెంటిస్తాను. అంతవరకూ రాకుండానే వెడితే ఆనందిస్తాను. యింకోసారి పొల్లు మాటవస్తే మీపిల్లను చేసుకోమని ఖచ్చితంగా చెప్తున్నాను,

దాసు: మాటలకీ చేతలకీ చాలాదూరం! డబ్బుఅనే జబ్బు మీలోవుంది. అదంటే మీకు యెక్కువప్రీతి. దాన్నిచూస్తే మీలో చెప్పలేని భ్రమ కల్గుతుంది. దానికివంగి గులామయి సలాంచేసేమీరు డబ్బిస్తే పరువునివదిలి పశువృత్తిలో జీవిస్తున్న కులటనైనా చేసుకుంటారు.

పురు : (బాగా ఆవేశంపెరిగి) పిచ్చిగాకూస్తే పళ్లు రాల్తాయ్.

దాసు: (రెండడుగులేసి పెద్దగా) ఆపు!

సీత : (ఆశ్చర్యంగా) దాసూ! (దాసు సీతయ్యనిచూచి తగ్గుతాడు) పెద్దా చిన్నా చూడక్కర్లేదురా!

పురు : కొరుకుడుపడని కల్మషాలను కలవరపెట్టి కార్యం సాధించాలనే కలవరింతలు.

దాసు: నిలువంతా విషంతో నిండిన నీవంటి......

సీత : (పళ్ళుబిగించి మందలింపుగా) నోర్ముయ్యరా! నోటికి యెంతమాటొస్తే అంతేనా? కాస్త వెనకాముందూ ఆలోచించాలి

దాసు: (వ్యకోపంతో) అదికాదునాన్నా!

సీత : అసలు నువ్విక్కడికి యెందుకొచ్చావ్?

దాసు: గుండెల్లోరేగిన మంటను చల్లార్చుకోటానికి! అనాచారాల్ని అరికట్టి సదాచారాల్ని స్థాపించటానికి.

పురు : (హేళనగా) ఆఁ! దేశాన్ని వుద్ధరిస్తానికి యీనాటికి దిగొచ్చారు మూలపురుషులు! సిగ్గులేకపోతేసరి!

దాసు: (ఆవేశంతో) షటప్! (మీదకెళ్ళబోతాడు.)

సీత : (దాసు చెయిపట్టుకొని) నేనిలా వుండటం నీకిష్టం లేదేంరా? నాగౌరవం కాపాడాలంటే వెంటనే యింటికెళ్ళు.

దాసు: కాదునాన్నా! వీళ్ళు......

సీత : (చీదరిస్తూ) ముందు వెడతావా లేదురా! (దాసు పురుషోత్తంని కోపంగాచూసి గబగబా వెళ్ళిపోతాడు. దాసు వెళ్ళేవరకూ అటేచూసి పురుషోత్తంతో) బావగారూ!

పురు : కొడుకుతో కయ్యమయింది. ఇక తండ్రితో మిగులుంది.
సీత : కాదు బావగారూ !
పురు : ఏంకావాలి ?
సీత : మాదాసు అభం శుభం తెలియని అమాయకుడు. వాడేదన్నా తొందరపడివుంటే క్షమించండి.
పురు : అంతకంటే యేమనగలవు ? అతను చేసిన తప్పుడు పనులకు మందలించటంపోయి మన్నించమని కోరుకుంటున్నావ్ ! యోగ్యతలేని అటువంటివాళ్ళను యేంచేసినా పాపంలేదు.
సీత : అనుభవంలేని పసికందు: వాణ్ణి నేమందలిస్తాను. మీరు మాత్రం వాడిమాటల్ని ఆధారంగా తీసుకొని బాధపడకండి.
పురు : (నిట్టూర్చి) ఊఁ !
సీత : ముహూర్తానికి వస్తారా ?
పురు : డబ్బు సిద్ధంచేశారా ?
సీత : యివ్వమంటారా ?
పురు : (మామూలు స్తాయిలో చిరునవ్వుతో) మీయిష్టం ! మంటపందగ్గర యిచ్చినా సంతోషమే.
సీత : ప్రస్తుతానికి రెండువేలుమాత్రం యిస్తాను.
పురు : అలాకుదరదు.
సీత : బావగారూ !
పురు : అంతే.
సీత : (దీనంగా) ముహూర్త ఘడియలు ముందుకువస్తున్నాయన్న కంగారుతో కాళ్ళావేళ్ళాపడి ప్రతిమిలాడితే

ఒక కరుణామయుడు రెండువేలు యిచ్చాడు. (చేతులు పట్టుకొని) యివి చేతులుకావు బావగారూ! కాళ్ళు. రెండు వేలుతీసుకొని ఆ మూడుముళ్ళూ వేయించండి. తతిమా మూడువేలూ రెండు మూడు రోజుల్లో యిస్తాను.

పురు : ఈ విషయంలో యెన్నిసార్లు ప్రాధేయపడి అడిగినా యిదేమాట వస్తుందని యిప్పటికి లక్షసార్లయినా చెప్పివుంటాను. దయతో మొత్తం డబ్బుకోసం ప్రయత్నించి మాకోసం కబురుచేయండి.

సీత : (నిట్టూర్చి బయటికి వెళ్ళబోతాడు.)

పురు : సీతయ్యగారూ!

సీత : (ఆగుతాడు.)

పురు : మాకు మూడున్నర గంటలకు బండివుంది. అవవలసిన కార్యం పూర్తిచేసే తాహతు లేకపోతే తొందరగా తెలియచేయండి. చేసిన పొరపాటుకి చంపలేసుకొని మావూరు మేం చేరుకుంటాం.

సీత : ఆ సర్వేశ్వరునిదయ. (వెళ్ళబోతాడు.)

పురు : అన్నట్లు లాంచనాలన్నీ గుర్తున్నాయిగా! మళ్ళీ గుర్తుచేస్తున్నాను. ఆడబిడ్డ అత్తగార్లకు ఒక్కొక్కరికి నూటపదహార్లు, వెండి కూజాబిందెలు, వెండి బొట్టు పెట్టెలు, పెళ్ళికుమారుడికి వెండిచెంబు, వెండిపళ్లెం' పట్టుబట్టలు వగైరాలన్నీ అక్కడే ఆ నిముషంలోనే అప్పగించాలి. (సీతయ్య తెల్లబోయి చూస్తాడు) పోతే మరోసంగతి! మాకుర్రవాడు అలకపాన్పుమీద

మోటారుసైకిలు కోరుతానని వాళ్ళమ్మతో అంటుంటే మా పెద్దమ్మాయివిని నాతో చెప్పింది. పేచీలకు దారి తీయకుండా మీపూచీ తీరిపోవాలనే తలంపుతో చెప్తున్నాను. లాంచనాల్లో యేఒక్కటి విడిచిపెట్టినా కుదరదు.

సీత : లాంచనాలు నేను యిస్తానన్లేదే!

పురు : అన్నారో అన్లేదో మాకనవసరం. మీమామధ్యన వుండ నేవున్నాను పెళ్ళిళ్ళ పరమేశం! లాంచనాలన్నీ యధావిధిగా యిచ్చితీరాలని ఆనాడే ఆయన్తో ఖచ్చితంగా చెప్పాను.

సీత : ఈ సంగతి మాతో ఆయన చెప్పలేదే!

పురు : దానికి నేనేంచేయను? యేనిముషాన లోటుజరుగుతే ఆ నిముషంతోటే పెళ్ళి ఆపుచేయబడుతుంది.

సీత : (సందేహంగా) యిన్నివస్తువులు ... ...

పురు : సమయానికి అందుబాట్లో లేకపోతే మరో వెయ్యి అదనంగా జమవేయించండి, అలాగయినా సరే! (చిన్నగా నవ్వుతూ లోపలకు వెడతాడు. సీతయ్యో ఆలోచిస్తుంటాను. నాల్గువేపులనుంచి వికటాట్టహాసం వినిపిస్తుంది.)

సీత : (తెల్లబోయి) ఎవరానవ్వేది? ఎందుకు నవ్వుతారు?

అవినీతి: (నీడగా వస్తుంది) ఏమిటాలోచన? ఎందుకాలోచన? నీవిద్యుక్తధర్మాన్ని గుర్తించి ముందుకునడు!

సీత : ఎక్కడికి?

అవినీతి: ఎక్కడికన్నా వెళ్ళు! యేమన్నా చెయ్! యెంతటి ఘోరానికైనా తలవంచు! నీకోసం, నీఆశ సుఖపడా లంటే డబ్బు తెచ్చే విధానంచూడు.

సీత : అవును. (వెళ్ళబోతాడు.)

నీతి : (ఎదురుగా నీడలాకనిపించి) ఆగు! (సీతయ్య ఆగు తాడు) అమాయకుడా! ఎక్కడికి నీప్రయాణం?

సీత : డబ్బుకోసం!

నీతి : తాహతలేనివాడివి యెక్కణ్ణుంచి తెస్తావ్?

సీత : నిజమే!

పురు : (తెరలో) మొత్తం లాంచనాలతోసహా ఆరువేలు చెల్లించాలి. (నవ్వుతాడు.)

సీత : ఆఁ!

అవి : ఆలోచనలేకుండా ముందు యిస్తానని యెందుకు మాటిచ్చావ్?

సీత : యిచ్చాను.

నీతి : అందుకోసం నీపరువుని నాశనం చేసుకుంటావా?

సీత : అందుకని—

అవి : ఏమన్నా చెయ్. ముహూర్త ఘడియలు సమీపిస్తు న్నాయ్. ఏంచేయటానికైనా వెరవకు. యెటువంటి మోసానికైనా ముందడుగెయ్. వెళ్ళు.

సీత : వెడతాను. వెడతాను. (గబగబా వెళ్ళబోతాడు.)

నీతి : పరువు ప్రతిష్ఠల్ని విడవకు. యీ నిముషంవరకూ నీతి నిజాయితీలతో బ్రతికిన నువ్వు యిందుమూలంగా తలవంపులు తెచ్చుకోకు!

సీత : అవును.

అవి : కాదు నువ్వుకోరేది ఆశక్షేమం!

సీతి : మానవుడుకి కావలసింది నీతి!

అవి : ఆశక్షేమం!

సీతి : నీతి!

అవి : ఆశక్షేమం!

సీతి : నీతి!

(ఇరుప్రక్కలనుంచి చెవుల్లో ప్రతిధ్వనిస్తున్న మాటల్తో యేటూ తోచక వెర్రిగాచూసి అక్కడున్న కుర్చీలో కూలబడతాడు. నీడలుగా కనుపించిన సీతి – అవినీతిలు మాయమవుతారు. రెండు మూడు క్షణాలకు తేరుకొని కుర్చీలోనుంచి లేచి ఒక్కసారి దీనంగాచూసి నెమ్మదిగా బయటకి వెళ్ళబోతాడు. లోపలనుంచి వాసు, బయట నుంచి వెంకటేశం ఒక్కసారి వస్తారు.)

వెంక : (సీతయ్యనుచూస్తూ) మీరు ... ...

వాసు : ఆమ్మాయితండ్రి.

వెంక : (వాసుతో) చూశావా! మీనాన్న యిరికించిన కత్తుల బోనులోనుండి తప్పించుకుని బయటపడలేక యెలాకొట్టుకుంటున్నాడో ఆ పెద్దమనిషి! వాసూ! మీనాన్నగుండె చలనంలేని రాతిబండలాంటిది.

(వాసు తలవంచుకుంటాడు.)

సీత : (తేరుకొని) తమరెవరో నాకు తెలియదు. ఒకరి బ్రతుకోసం మరొకరిని నిందించటం మంచిదికాదు.

వెంక : పైకం... ...

సీత : రెండువేలుంది.

వెంక : అవిచ్చి తతిమ్మాది తర్వాత యిస్తానని చెప్పలేక పోయారా ?

సీత : చెప్పాను. వప్పుకోనన్నారు.

వెంక : నాకు తెల్సు అలాఅంటాడని. (వాసు లోపలకు వెడతాడు) యీ తప్పు ఆయన్దికాదు. (లోపలకు వెడుతున్న వాసుని చూపిస్తూ) వాడిది ! యిటువంటి వాళ్ళను ఆశ్రయించి లాభంలేదు. వాళ్ళు మంచిని యెంచరు. వాళ్ళకు కావలసింది డబ్బు. దానికోసమే వాళ్ళు పుట్టిపెరిగేది. విలాసానికి కులాసాగా కాలం గడిపే అలాంటివాళ్ళకు పేదవాళ్ళయిక్కట్టు కనిపించవు. (సీతయ్య వెంకటేశాన్ని చూస్తాడు) నేనెవరో మీకు తెలియకపోవటమే మంచిది. నామాటయందు యేమాత్రం విశ్వాసంవున్నా ఈ సంబంధం వెంటనే రద్దుచేసుకోండి.

సీత : (తెల్లబోయి) ఆఁ ! ఏమన్నారూ? రద్దుచేసుకోవాలా? మీరన్నట్లు రద్దుచేసుకుంటే నలుగుర్లోనూ తలెత్తుగు తిరగ్గలనా ? యెంతటి అపవాదులకు గురికావలసి వస్తుందో ఆలోచించండి.

వెంక : అందుకని లేనిబాధల్ని కొని తెచ్చుకుంటారా !

సీత : అందుకు నాకుచింతలేదు. శుభమంటూ ఆడపిల్ల పెళ్ళిచేయలేక దాన్ని అల్లరిపెట్టి నేను అల్లరి పాలవుతున్నాననే బాధమాత్రం నాహృదయాన్ని

ముహూర్త ఘడియలు సమీపిస్తున్నాయ్ డబ్బు కోసం... ...

వెంక : రెండు వేలున్నాయన్నారు.

సీత : వున్నాయ్.

వెంక : కావలసింది మూడు వేలేగా !

సీత : లాంచనాలు యివ్వాలని ముందు చెప్పలేదు.

వెంక : ఇప్పుడు చెప్పాడా ?

సీత : (అవునన్నట్లు తలపంకిస్తాడు.)

వెంక : (తెల్లబోయి) ఆరిదుర్మార్గుడా ! (ఆలోచిస్తాడు.)

సీత : సమయానికి అందుబాట్లో లేకపోతే మరో వెయ్యి రూపాయలు జమ వేయమన్నారు.

వెంక : (పరాకుగా) అంటాడంటాడు. (బయటనుంచి గిరీశం సూటుకేసుతో వస్తాడు. వెంకటేశం తేరుకొని) పైకం సర్దుబాటుచేసేమార్గం యేదన్నా వుందా ?

సీత : (విచారంగా) లేదు. (గిరీశం అర్థంకానట్లు సీతయ్య వెంకటేశంలను చూస్తాడు.)

వెంక : సరే ! (గిరీశాన్ని అదోలాచూసి సీతయ్యతో) మీరు యింటిదగ్గరే వుండండి. నేను మీ వెనకే వస్తాను. యేదో మార్గం ఆలోచిద్దాంమరి. (సీతయ్య నెమ్మదిగా బయటకు వెడతాడు.)

గిరీ : (సీతయ్యను ఆశ్చర్యంగాచూసి అర్థంకానట్లు వెంకటేశంతో) ఎవరాయన ?

వెంక : (తెల్లబోయిచూస్తూ) మామగారిధాటికి తట్టుకోలేక అవస్థపడుతున్న అభాగ్యుడు.

గిరీ : (నొసళ్ళు చిట్లించి) అర్థమయేలా చెప్పు. (సూటుకేసు మంచంమీాద పడేస్తాము.)

వెంక : అంటే కాబోయే వియ్యంకుడన్నమాట !

గిరీ : ఆయనతో యిదివరకే పరిచయముందా ?

వెంక : (గిరీశాన్ని చూసి) ఎవరికి ?

గిరీ : నీకు.

వెంక : నీకూ్కడా పరిచయం చేయమంటావా ?

గిరీ : ఎందుకు ?

వెంక : ఠకమండ్ చేయటానికి.

గిరీ : ఎవరికి ?

వెంక : మామగారికి.

గిరీ : ఏవిషయంలో ?

వెంక : ఆయన మెడకు తగిలించినవుచ్చు తీయించేవిషయంలో.

గిరీ : (హేళనగా) నువ్వు చేయలేకపోయావ్ !

వెంక : ప్రయత్నించాను. నామాటకు విలువ లేకపోయింది.

గిరీ : నామాటమాుదలిమా త్రం విలువుంటుందనేమిటి ?

వెంక : పెద్దల్లుడవి ! అందులోనూ బావమర్దివి !

గిరీ : రెండో అల్లుడివి ! మేనల్లుడవి ! నువ్వుమాత్రం తక్కువతిన్నదేముంది ?

వెంక : మనకంటే యెక్కువ తిన్నాడుకనుకే పాపమా అమాయకుడు నెత్తినయెక్కి పిండికొడుతున్నాడు.

గిరీ : ఏమొచ్చింది ?

వెంక : ఏమొచ్చినా మామగారు నీకు కట్నంగా చదివించిన పొలంప్రాశాడా ?

గిరీ : వాళ్ళమ్మాయి పేరు నే వ్రాయమన్నాంగా !
వెంక : అలాగూ చేయలేనుగా !
గిరీ : ఇప్పుడు ఆమాట గుర్తుకొచ్చిందేం ?
వెంక : వ్రాయించుగోటానికి యిదే సమయం. దమ్ముంటే వెళ్ళిఅడుగు.
గిరీ : నీకూ యివ్వాలిగా కట్నం !
వెంక : అడగటం, మొండిచేయి చూపించటం రెండూ జరిగాయ్.
గిరీ : ఆ మొండిచెయ్యే నన్నూ చూడమనా నీసలహా ? (నవ్వి) మనగోడవలు అటుంచి అసలు సంగతి ముక్కుకు సూటిగా చెప్పు.
వెంక : అదిపరే ! (అటూ యిటూ చూసి స్థాయి తగ్గించి) నువ్వు రావట మెవరన్నా చూశారా ?
గిరీ : ఇంతవరకూ నువ్వేచూశావ్.
వెంక : అయితే ఒకపని చెయ్.
గిరీ : లక్షపనులు చేస్తాను. ఏమిటో చెప్పు.
వెంక : ఎందుకు చెప్తున్నానో విని ఎదురు ప్రశ్న వేయక ... ...
గిరీ : ఏం చెయ్యమంటావ్ ?
వెంక : వచ్చినదార్ని వెళ్ళిపొమ్మంటాను.
గిరీ : (త్రుళ్ళిపడి) అదేమిటి ?
వెంక : అనుమానం తర్వాత తీరుస్తాను. కారణం తెల్సు కోందే కాలు కదపటానికి యిష్టంలేకపోతే వెళ్ళి యీ ప్రాంతాల్లోనే యెక్కడన్నా వుండు. నేనొచ్చి

అంతా చెప్తాను. (మంచంమీాద సూటుకేసు గిరీశానికి అందిస్తాడు)

గిరీ : (సూటుకేసు అందుకుని క్షణం యోచించి) సరే!

వెంక : (అటూ యిటూ చూసి) ఎవరికంటా పడకుండా వెళ్ళాలి.

గిరీ : (నవ్వుతూ) అలాగే! (బయటకి వెళ్ళబోతాడు.)

వాసు: (లోపలనుంచి వస్తూనే) హలో గిరీశంమామా! ఎప్పు డొచ్చావ్?

గిరీ : (ఆగి) ఇప్పుడేవచ్చాను. ఇప్పుడే వెడుతున్నాను. (వెంకటేశం నిట్టూరుస్తాడు.)

వాసు: అదేమిటి? (అర్థంకానట్లు వెంకటేశాన్ని చూస్తాడు.)

వెంక : నాకూ తెలియదు. నీకిచ్చిన జవాబే నాకూయిచ్చాడు. (గిరీశంతో) ట్రయిన్ టయిమయింది. వెళ్ళతల్చు కున్నాక వెంటనే వెళ్ళటం మంచిది

గిరీ : (రిస్టువాచి చూసుకొని) ఓ! (వాసుతో) వెళ్ళొస్తాన్రా వాసూ! నాలుగురోజులుపోయాక మీాఅక్కయ్యనూ పిల్లల్నీ పంపెయ్! మళ్ళీ రావటానికి నాకు శెలవు దొరుకుతుందో లేదో!

వాసు: (స్థాయిగా) వెళ్ళాల్సిందేనా?

గిరీ : నోడౌట్. (నవ్వి) వస్తా. (గబగబా బయటకి వెడతాడు)

వాసు: ఏమిటిబావా యీా నాటకం?

వెంక : నాటకాలూ, బూటకాలూ ఆడే అలవాటు నీకూ, మీానాన్నకే వుంటుంది.

వాసు: నీకేం తెలియదా?

వెంక : అని ముందే చెప్పాను. వాడికేంకష్టం కల్గిందో వాడు వెళ్ళాడు. నేనూ వెడుతున్నాను.

వాసు: మళ్ళీ యేంమాటలు ? యింతకుముందేమన్నావ్ ?

వెంక : ఏమన్నా వెళ్ళాల్సిందే ! యీ వెళ్ళటం నీమీద అభిమానంలేక, నీపెళ్ళి చూడలేక కాదు.

వాసు: మరెందుకు ?

వెంక : మనసుండీ యితరులకు జరిగే పరాభవాన్ని చూళ్ళేక. (లోపలకు చూస్తూ) ఏమేవ్ ! సరోజా ! పెట్టె బెడ్డింగు సర్దు. నేవెళ్ళి బండితీసుకొస్తాను. (బయటకు వెళ్ళబోతాడు.)

వాసు: (స్థాయిగా) పెళ్ళికాకుండానే వెడతావా ?

వెంక : ఆ యోగం నీమొహాన వున్నట్లు కనుపించట్లేదు.

వాసు: ఎందుకని ?

వెంక : నీప్రశ్నకు జవాబు యివ్వాల్సింది మీనాన్న.

వాసు: అయితే విను బావా ! పెద్దవాళ్ళ ప్రతిజ్ఞలకోసం మీరు వెడితే మనమధ్యవున్న బంధుత్వంగాని, స్నేహంకాని నాలుగురోజులపాటు చిరస్థాయిగావుండదని గ్రహించు.

వెంక : (తెల్లబోయి) వాసూ !

వాసు: అవును. ఆలోచించి అటో, యిటో నీమనస్సు యెటు లాగుతే అటుచేయుచ్చు. (మంచంమీద కూర్చుం టాడు. వెంకటేశం క్షణం ఆలోచించి లోపలకు వెడతాడు. వాసు నవ్వుతూలేచి లైటుఆర్పి మంచం మీద పడుకుంటాడు. బయట తలుపుతెరచిన చప్పుడు వినిపించి వెంటనేలేచి కూర్చుంటాడు. బయటనుంచి

ఆశ నెమ్మదిగా ముసుగుతో వస్తుంది. (వాసు లేచి లైటు వెలిగించి) ఆఁ! ఆశ! (ఆశ వాసు కాళ్ళు పట్టుకుంటుంది) యెందుకిలా వచ్చావ్!

ఆశ : ఆశ్రయ భిక్షకోసం!

వాసు: (ఆశ్చర్యంగా) ఆశ్రయభిక్ష! (లోపలకు వెళ్ళే మార్గం వేపుచూసి తలుపు దగ్గరకు వేసివస్తాడు.)

ఆశ : ఆడదకోరేది అదే! (వాసు భుజాలుపట్టి లేవతీస్తాడు.)

వాసు: ఏమిటి నీధోరణి?

ఆశ : కరుణిస్తారని గంపంత ఆశతో వచ్చాను.

వాసు: (మంచం చూపించి) కూర్చో. అర్ధరాత్రి వంటరిగా...

ఆశ : తిప్పనిసరైంది. తలవని తలంపుగా వచ్చాను.

వాసు: మీవాళ్ళకు తెలుసా?

ఆశ : తెలుస్తే రానిస్తారా?

వాసు: ఇప్పుడు తెలుస్తే యేమవుతుంది?

ఆశ : ఎందుకు వెళ్ళావని చివాట్లు పెడతారు.

వాసు: దానికి నీజవాబు?

ఆశ : మీకిచ్చినజవాబే అక్కడాయిస్తాను.

వాసు: మావాళ్లెవరన్నా చూస్తే?

ఆశ : కోప్పడతారని కంగారు పడుతున్నారా? అన్నీ తెలిసినవారు, చదువుకున్నవారు ఆమాత్రం జవాబు యివ్వలేరూ?

వాసు: (తెల్లబోయి) నేనా!

ఆశ : ఏం?

వాసు: ఏమని చెప్పేది?

ఆశ : ఆ యువకులు మాట్లాడుకోటంలో అపరాధంలేదని !

వాసు: పెళ్ళిగాకుండానే !

ఆశ : రెండు మూడు గంటల్లో అవబోతోందిగా !

వాసు: కట్నం సంగతి తేలద్దూ ?

ఆశ : తేలితేనేగాని జరగదా ?

వాసు: అనే మానాన్న చెప్పారు.

ఆశ : మీరనేదికూడా అదేనా ?

వాసు: నాన్నమాట కాదనగలనా ?

ఆశ : ఆమాత్రం స్వాతంత్ర్యంలేదూ ?

వాసు: వున్నా వ్యవహారం చెయిజారిపోయింది. (నిర్మొహమాటంగా) కట్నం యిస్తేనే కళ్యాణం జరుగుతుంది.

ఆశ : మీకు గావలసింది కట్నమా ? అనురాగమా ?

వాసు: రెండూను.

ఆశ : ప్రాముఖ్యత దేనికిస్తారు ?

వాసు: ముందు కట్నానికే !

ఆశ : చదువుకున్నవాళ్ళు అనాల్సినమాటేనా ?

వాసు: చదువుకోనివాడు అనగలడా ?

ఆశ : మనకంటే వాళ్ళల్లోనే మంచిమర్యాద వున్నాయేమో!

వాసు: అటువంటివాణ్ణే చూసి చేసుకోపోయావ్ ?

ఆశ : కాబోయేభార్యకు యివ్వాల్సిన జవాబేనాయిది ?

వాసు: తప్పేముంది ?

ఆశ : వుందో లేదో తెలియదా ?

వాసు: లేదనే నానమ్మకం.

ఆశ : వరకట్న నిషేధచట్టం ప్రవేశించినట్లు తెలుసా ?

వాసు: (నొసళ్ళు చిట్లించి) తెలుస్తే?
ఆశ : చట్టాన్ని వ్యతిరేకిస్తే శిక్షేమిటో తెలుసా?
వాసు: తెలుస్తే?
ఆశ : తెలిసే యింత పట్టుపట్టారా?
వాసు: పట్టుదలకీ చట్టానికీ సంబంధంలేదు. కట్నం యెందుకు తీసుకుంటున్నారో తెలిసుంటేగా చట్టం ప్రవేశపెట్టిన ప్రభుత్వానికి!
ఆశ : మీకు తెలిస్తే చెప్పరాదూ?
వాసు: చెపుతున్నాను విను. పెంచి పెద్దచేసి నాభవితవ్యంకోసం ఆరాటపడి నన్నొక వ్యక్తిగా తయారుచేసినందుకు చేసిన అప్పు కట్నం తీసుకుని తీర్చకపోతే యెలా తీరుస్తారు?
ఆశ : ఆ మాటకొస్తే ఆడపిల్లల్నికూడా అప్పుచేసే పెంచారేమో!
వాసు: పెంచుతే?
ఆశ : ఆ అప్పు తీర్చటానికి మగపెళ్ళివారు కొంత కట్నం యివ్వాల్సి వుంటుందేమో!
వాసు: (విసుగ్గా) ఏమిటి నీ అర్థంలేని మొండివాదన! (కొద్ది స్థాయిపెంచి) అసలు నువ్వెందుకొచ్చినట్లు?
ఆశ : మాదీన స్థితి చెప్పి వప్పించడానికి!
వాసు: ఫలితంలేదు.
ఆశ : నాకోసం త్యాగం చేయలేరా?
వాసు: అస్వతంత్రుణ్ణి.
ఆశ : అంతేనా?

వాసు: నేను తల్లిదండ్రులచాటువాణ్ణి. వాళ్ళను వ్యతిరేకించి ప్రవర్తించగలశక్తి నాకులేదు. వృథా ప్రయాసపడి నాదగ్గర ప్రాధేయపడ్డంవల్ల లాభంలేదు. (హెచ్చరికగా) ఆడపిల్ల అనుపులేకుండా అర్ధరాత్రి నంటరిగా రావటం తప్పని గ్రహించి వెడితే సంతోషిస్తాను.

ఆశ : (వాసుని ఎగాదిగాచూసి) వెడుతున్నాను. (రెండడుగులేస్తుంది.)

వాసు: ఆశా !

ఆశ : (ఆగుతుంది.)

వాసు: ఇంతవిశీదిలో నేనీ గదిలో వున్నానని యెవరు చెప్పారు ?

ఆశ : ఎవరుచెప్తేనేం ?

వాసు: మీయింటివరకూ సాయంవచ్చేదా ?

ఆశ : (కటువుగా) మీ కేమిటి సంబంధం ?

వాసు: అర్ధమయ్యేలా చెప్పు.

ఆశ : అభిమానంలేని మనుష్యులకు అంతశ్రమ యివ్వదల్చుకోలేదు. పేదవాళ్ళమైనా పరువు ప్రతిష్ఠలకోసం ప్రాకులాడుతోనే వుంటాం. నడివీధిలో అర్ధరాత్రి అర్ధంలేకుండా పరాయిపురుషుణ్ణి వెంటపెట్టుగెడితే వినేవాళ్ళకు విడ్డూరంగాను, చూసేవాళ్ళకు విచిత్రంగానూ వుంటుంది. లేనిఅపనిందల్ని కోరితెచ్చుకోవల్సి వస్తుంది. అభిమానం చంపుకొని స్వయంగావచ్చి యాచించినందుకు యీమాత్రమైనా దయ కల్గింది. శెలవ్ ! (వెళ్ళబోతుంది.)

వాసు: (సమీపించి) కోపంవచ్చిందా ?

ఆశ : (ఆగి) ఎందుకోపం ?

వాసు: ఇలా మాట్లాడానని.

ఆశ : తప్పు నాదగ్గరుంది కాబట్టి మాట్లాడాను.

వాసు: మీనాన్న డబ్బుకోసం ప్రయత్నిస్తున్నారా ?

ఆశ : అవన్నీ విరమించుకున్నట్లే!

వాసు: ఇంతకుముందేగా మాట్లాడి వెళ్ళారు !

ఆశ : ఏమని ?

వాసు: రెండువేలుందిట. తతిమాదానికోసం... ...

ఆశ : ప్రయత్నించినా పెళ్ళిజరగదు.

వాసు: ఆఁ !

ఆశ : ఈ సంబంధం నాకిష్టంలేదు.

వాసు: (త్రుళ్ళిపడి) ఏమన్నావ్ ?

ఆశ : వున్నమాటే అన్నాను. పాతికేళ్ళుపైబడ్డా తండ్రి చాటు పిల్లాడుగా నటించే మీవంటివాళ్ళను చేసుకుని మాత్రం అనుభవించే సుఖమేమిటి? మీకు కావల సింది కట్నం. నీతి అవినీతి అక్కర్లేదు. దానికోసం యెటువంటి దారుణాలకైనా తలవంచుతారు. ఎలాంటి అబద్ధాలు ఆడడానికైనా వెనుదీయరు. (స్థాయిపెంచి) అయిదువేలమీకుండే అపేక్షకొద్దీ నమ్మకంగా నామెళ్ళో తాలికట్టి మరో అయిదువేలు ఆర్జించాలన్న అభిలాషతో నాకిభార్య అక్కర్లేదంటే నేనేంకాను ?

వాసు: నాకూ నీతిఅనేదుంది.

ఆశ : లాభం? అవసరమైతే మీనీతిని, మీలోవున్నమతిని, మీనాన్న కిర్రుచెప్పుల కాళ్ళక్రింద పెట్టటానిక్కూడా సిద్ధపడతారు.

వాసు: (స్థాయిగా) ఆశా!

ఆశ : వ్యక్తిత్వంలేని మీవంటి వెర్రిబాగులవాణ్ణి చేసుకుని జీవితాంతం యేడ్చేకంటే యేహిందీయో చదివి పది మంది పిల్లలకు ప్రయివేటు చెప్పుకోటం యెంతైనా మంచిది. సుఖంగా పొట్టగడుస్తుంది. ఈనానిర్ణయాన్ని మానాన్నకు చెప్పి యీ మీ సంబంధం రద్దుచేయించి తీస్తాను. (రెండడుగులేస్తుంది.)

వాసు: (శూన్యంగాచూస్తూ) ఆశా!

ఆశ : (వెనక్కి తిరిగి హెచ్చరికగా) మర్యాదిచ్చి మాట్లాడటం నేర్చుకోండి. నాపేరు ఆశకాదు. ఆశాలత! దయవుంచి "ఆశాలతగారూ!" అని పిలవండి. (వాసుని మొగాడిగాచూసి) హుం! (చరచరా వెడుతుంది. వాసు కంగారుతో అటూ యిటూ తిరుగుతూంటాడు. లోపలనుంచి వెంకటేశం రగ్గు భుజాన వేసుకొని ఆవలిస్తూవస్తాడు. వెంకటేశాన్నిచూసి వాసు మంచంమీద కూర్చుంటాడు.)

వెంక : అబ్బబ్బ! యేంకొంపరాబాబూ యిది! కన్ను మూతపడటంలేదు. దోమలు కుట్టి చంపేస్తున్నాయ్.

పధకుగుమీాదన్నా పడుకుంటాను. (సిగరెట్ వెలిగిస్తూ వాసునిచూసి) యింకా నువ్వు నిద్రపోలేదురా ఓరి పిచ్చిమొంపతెగ! పెళ్ళికాదేమోనని దిగులుపట్టిం దేంరా! పెళ్ళి తప్పకుండా చేస్తార్లేరాబాబూ! మనసు... ...

వాసు: (మామూలుగా) బాగుళ్ళేదురా!

వెంక: శుభం! ఎలా బాగుంటుంది? నీమనస్సు బాగున్నా లేకపోయినా మీానాన్న మనస్సుమాత్రం మహదా నందంలో మునిగితేల్తోంది. (లోపలకు చూపిస్తూ) అటుచూడూ! దోమలబాధన్నా లేకుండా కుర్చీనిండా పడుకొని యెంత నిశ్చింతగా నిద్రపోతున్నాడో!

వాసు: అదికాదురా!

వెంక: ఏదికాదు?

వాసు: ఆమ్మాయి వచ్చెళ్ళింది.

వెంక: ఏమ్మాయ్?

వాసు: ఆశ!

వెంక: (నోసళ్ళు చిట్లించి చూస్తూ) పెళ్ళికూతురా!

వాసు: ఊఁ!

వెంక: (హేళనగా) ఏడ్చావ్. (వెళ్ళబోతాడు.)

వాసు: (ఆపి) నిజంగానేరా!

వెంక: (ఆగి) ఆఁ! ఎప్పుడు?

వాసు: ఇంతకుముందే.

వెంక : చిత్రంగావుందే ! (క్షణం ఆలోచించి) కొంపతీసి కల కాదుకదా ?

వాసు: కలాకాదు, గిలాకాదు. నమ్మంవాల్చానో లేదో వచ్చేసింది.

వెంక : ఏమంది ?

వాసు: నాపాదాలదగ్గరకూర్చొని ఆశ్రయభిక్ష కోరుకుంది.

వెంక : నువ్వేమన్నావ్ ?

వాసు: అస్వతంత్రుణ్ణన్నాను.

వెంక : ఏడవలేకపోయావ్ !

వాసు: చేసేదేముంది ?

వెంక : నేపట్టిన కుందేటికి మూడేకాళ్ళు అనేరకానికి బుద్ధి వచ్చేలా చేయాలి !... ...గుట్టు చప్పుడుకాకుండా మీరిద్దరూ పరారయితే యెంతబాగుండేది ?

వాసు: సమయానికి... ...

వెంక : సాహసించలేకపోయావా ?

వాసు: ఆ ఆలోచనే తట్టలేదు.

వెంక : మట్టిబుర్రయితేసరి ! గుట్టుగా యేతిరపతికొండమీదకో తీసుగెళ్ళి తాలికడితే తీరిపోయేది !

వాసు: పెద్దవాళ్ళు... ...

వెంక : ఎద్దుల్లాగావున్నారు. లాభం ? దేముడుకంటే పెద్దవాళ్ళేవరు ? (నిట్టూర్చి) అవకాశం యెందునా కాకుండా పాడుచేశావ్ ! (వాసునిచూస్తూ) యింతకీ ఏమంది ?

వాసు: నన్ను చేసుకోనని ఖచ్చితంగా చెప్పింది.

వెంక : చెప్పదుమరి ! మన తెలివితేటలు ముందే గ్రహించి వుంటుంది. యింకేరా చకచకాగా వెళ్ళి ఈ సంగతి మీనాన్నకు చెప్పు. (బయటకు వెళ్ళబోతాడు. పర మేశం ఎదురొస్తాడు. వెంకటేశం ఆగుతాడు.)

పర : (వాసునిచూస్తూ) అబ్బాయ్! పురుషోత్తంగారు లేరూ?

వెంక : లేకపోవటమేంఖర్మ ! (చూపిస్తూ) ఆ గదిలో గురక పెట్టి నిద్రపోతున్నాడు.

పర : లేపునాయనా !

వెంక : (వాసు లోపలకు వెళ్ళబోతాడు) నువ్వుండరా ! (వాసు చెయిపట్టుకుంటాడు) పరమేశంగారూ ! మరేం ఫరవాలేదు. ఆయన్తో చెప్పదల్చుకున్న రాచకార్యం మాతో చెప్పండి:

పర : (చిన్నగానవ్వి) యిందులో రాచకార్య మేముంది నాయనా ? (నవ్వి) పెళ్ళివారింటికి బయల్దేరే ఏర్పాట్లో వుండమని చెప్పాలి.

వెంక : (వాసు బరువుతీరినట్లుగా శ్వాసపీల్చి వదుల్తాడు) మేం చెప్తాంగాని, మరి... ...

పర : (వాసు మంచంమీదకూర్చొని తెల్లబోయి చూస్తూంటాడు) తెల్సు తెల్సు ! మీసందేహం నాకు తెల్సు. అయిదువేలూ, లాంచనాలుతాలూకు వెయ్యి వెరసి ఆరువేలూ సిద్ధంచేసే... ...

వెంక : తిమరొచ్చారు. (నిట్టూర్చి) అమ్మయ్య ! మధ్యా మేం బ్రతికాం. కాకపోతే మర్నాటినుంచి యీ తండ్రీ కొడుకుల ధర్మమంటాను, తమదయూంటాను ఆయన చేతికి చిప్పనస్తుందేమోకాని—

పర : అహాహా ! ఎంతమాట ! నాకు వుభయులూ పక్కలే. యింతవరకూ నాహస్తంమీద కుదిర్చిన సంబంధం యేదీ పాడవలేదు. (నవ్వి) అయినా మనమంతా వుండగా అంతవరకూ రానిస్తామా ?

వెంక : అవునవును. (పరమేశాన్ని కోపంగా చూస్తాడు.)

పర : (రెండడుగులు ముందుకు వేసి) మీరు మర్చిపోకుండా చెప్పండేం. శెలవ్ ! (వేగంగా బయటకు వెడతాడు.)

వెంక : (పరమేశం వెళ్ళినమార్గం చూస్తూ) హు ! (వాసుని చూసి త్రుళ్ళిపడతాడు) ఆఁ ! అయింది ! (వాసుని సమీపించి పరిశీలనగా చూసి) అనుకున్నంతా అయింది ! (గబగబా లోపలకు వెళ్ళి గ్లాసుతో నీళ్లు తెచ్చి వాసు నోటిదగ్గర పెట్టి) యిందా !

వాసు: (తేరుకొని తన నోటిదగ్గరున్న నీళ్ళగ్లాసు చూసి) ఏమిటి ?

వెంక : మంచినీళ్ళు !

వాసు: అని తెలుసు. యెందుకు ?

వెంక : త్రాగటానికి.

వాసు: ఎవరిమ్మన్నారు ?

వెంక : నీవాలకం ; రెండుగుటకలేస్తే కొంచెం ప్రాణం తేరుకుంటుంది.

వాసు: (గ్లాసు అందుకొని) థాంక్స్ ! (ప్రక్కన పెడతాడు.)

వెంక : (నవ్వి, లోపలకు వెళ్ళబోయి ఆగి బయటకుచూస్తూ) భజంత్రీలూ ! (చప్పట్లు కొడుతూ స్థాయిపెంచి) ఓ భజంత్రీలూ ! యింతవరకూ మామేళాం అయింది. యిక మీ మేళాం మొదలుపెట్టండి. పెళ్ళివారింటికెళ్ళాలి. ఊఁ ! కానివ్వండి ! యెంతబాగావాయిస్తే అంతడబ్బు. ఊఁ ! ఊఁ ! అప్పుడే అయిందీ ? యింక యెంతఅల్లరికావాలో ! ముందున్నది ముసళ్ళపండగ ! వాయించండి ! వాయించండి ! ! (వాసు విరగబడి నవ్వుతూ వుంటాడు. వాసునిచూస్తూ) సిగ్గు లేకపోతే సరి ! ఆ మొహంచూడు ! (లోపలకు . నెడతాడు. వాసు వెంకటేశం వెళ్ళినవేపే చూస్తూంటాడు. బయటనుంచి సన్నాయిమేళాం వినిపిస్తుంది )

[ తెర వ్రాలును. ]

# రంగం 2

[ రాత్రి రెండుగంటల ప్రాంతం. స్థలం సీతయ్యగారియింట్లో ఒకగది. ఎదురు గోడకు వొకటి రెండు దేముళ్ళఫొటోలు. రెండు మూడు దేశనాయకుల ఫొటోలున్న కేలండర్లు వ్రేలాడుతూంటాయ్. గదిలో ఒకకుర్చీ, గోడను ఆన్చబడివున్న పట్టెమంచం కనిపిస్తూంటాయ్. తెర ప్రక్కకు తొలుగుతుంది. ఆశ లోపలనుంచి ప్రవేశించి గతందా అదోలా పరికించి చూస్తుంది దాసు కొబ్బరితాడుకు మామిడాకులు గుచ్చుతూ బయటనుంచి వస్తాడు. ]

ఆశ : అన్నాయ్ !

దాసు: ఏంకావాలి చెల్లాయ్ !

ఆశ : నాన్నగారు రాలేదూ ?

దాసు: (నిట్టూర్చి) వస్తారు.

ఆశ : ఎక్కడికెళ్ళారో తెలుసా ?

దాసు: ఇంకెక్కడికెడతారు ? కాబోయే అల్లుడుగారికి ముడుపుకోసం మూట తయారు చేయటానికి వెళ్ళుంటారు.

ఆశ : ఎందుకీ వృధా ప్రయత్నం ?

దాసు: అర్థమయ్యేలా చెప్పు.

ఆశ : ఈ సంబంధం నాకు యిష్టంలేదు.

దాసు: (చేతిలోవున్న తాడు వదిలి ఆశ్చర్యంగా) చెల్లాయ్ !

ఆశ : అవునన్నయ్యా !

దాసు: ఆలోచించే అంటున్నావా ?

ఆశ : అనటంలో తప్పుందా ?

దాసు: ఆచరణలో పెట్టటం అసాధ్యమేమో!

ఆశ : ప్రయత్నానికి మించిన అసాధ్యం వుందా?

దాసు: నాన్న పడుతున్న అవస్థ చూళ్ళేక అంటున్నావేమో!

ఆశ : అదీ వొక కారణమై వుండచ్చు.

దాసు: మరో కారణంకూడా వుందా?

ఆశ : సుంకమిచ్చి కొని తెచ్చే భర్త నాకక్కర్లేదు.

దాసు: దానికి మనమేంచేస్తాం? కాలం అలావుంది. యీ రోజుల్లో యీడూజోడూ, అందచందాలు అక్కర్లేదు. మొగపిల్లవాడు పుట్టింది మొదలు మాటలకోసం ముందడుగేసే మాటల్తోనే గాల్లో మేడలు నిర్మిస్తున్నారు. కూటికి లేనివాడూ కట్నానికే కలవరిస్తున్నాడు. ఆస్తివున్నవాడూ అందుకే తాపత్రయ పడుతున్నాడు. అల్లుడు రావాలంటే ఈ లంచాన్ని లాంచనరూపంలో యిచ్చితీరాలి అంతేగాని అమ్మాయిని చూసి అల్లుడువచ్చే రోజులు రాలేదు

ఆశ : (నిర్లక్ష్యంగా) అలావచ్చినరోజునే చేసుకుంటాను.

దాసు: రాకపోతే?

ఆశ : బ్రహ్మచారిణిగావుంటే వచ్చిన నష్టంలేదుగా!

దాసు: (హేళనగా) లేదులే. (నవ్వుతాడు.)

ఆశ : ఎందుకా నవ్వు? అన్నమాటలో పొరపాటుందా? వ్యక్తికత స్వాతంత్రం లేనివాళ్ళను బజార్లో కొనే వస్తువులాగా రొక్కంపోసికొని అల్లుడనే హోదా యిచ్చి, మెళ్ళో గుదిబండ కట్టించుకునేకంటే యే స్త్రీ జనాభ్యుదయశాఖలోనో కృషిచేసి మరోవిధంగా

పోట్లాడటానికి మార్గం చూసుకుంటే మంచిది కాదూ? యీ నా నిర్ణయాన్ని నాన్నకూడా చెప్పదల్చుకున్నాను.

దాసు: చాలా బాగుంది. కాని—(సందేహిస్తాడు.)

ఆశ : సందేహిస్తావేం ?

దాసు: మరొక విషయంకూడా ఆలోచించటం అవసరం.

ఆశ : ఏమిటది ?

దాసు: ఈ నీ ప్రవర్తన నాన్న మనస్సుకి కష్టం కల్గిస్తుందేమో !

ఆశ : అప్పులుపాలై తిప్పలుపడేకంటే కలిగిన కొద్ది కష్టంతోటే ఒడ్డునపడటం మంచిది కాదూ ?

దాసు: నిజం ! ఏమంటూ యీ పాడు సంబంధం కుదిర్చారో ఆరంభంనుంచీ అన్నీ అవాంతరాలే. యితరుల కష్టసుఖాల్ని గుర్తించలేక కట్నంకోసం కాళ్ళుజాచుకు కూర్చున్నవాళ్ళకు గుణపాఠం చెప్పటం మంచిదే. కాదని అన్ను. కాని, ఈ సందర్భంలో నేను చెప్పేది ఒక్కటే. ఆలోచించి ఆత్మనిగ్రహంవుంటేనే యీ సంబంధం వద్దని పట్టుపట్టి ఆదర్శంకోసం పాటుపడు. నిదర్శనంగా నీకథనే బోధించి విజయం సాధించు.

ఆశ : అలా చేయాలని మనస్ఫూర్తిగా వుందన్నాయ్.

దాసు: చేయలేకపోతే యిప్పటివరకూవచ్చిన అపఖ్యాతి గుర్తుంచుకోని తటస్తంగా వూరుకో.

ఆశ : నన్ను అనుమానించకు. యీ మాటల్ని పరిశుద్ధమైన ఆత్మతో, తదేకదీక్షతో ఆచరణలో పెట్టాలన్న అభిలాషతోనే అంటున్నాను.

దాసు: (ఆశ్చర్యంగా) నిజంగానా ?

ఆశ : నీతి నిజాయితీలకోసం పోరాడటంలో నీకేమాత్రం తీసిపోదు నీ చెల్లెలు.

దాసు: (ప్రేమగా భుజాలు పట్టుకొని కళ్ళల్లోకిచూస్తూ) అలాగే వుండాలి చెల్లాయ్! ఆ పట్టుదలే నీలోవుంటే ముందడుగేస్తే తప్పకుండా జయించి తీరుతావ్. లాంచనాలంటూ అంచనాలేసుకొని కట్నాలకోసం కళ్ళుగానక ప్రవర్తించేవాళ్ళకళ్ళు తెరిపించినదానవవుతావ్! ఆడపిల్లల్ని కనిపెంచి కట్నాలుపోయలేక కుళ్ళి కృశించే నాలాంటి నిర్భాగ్యులంతా యీ నీ కథను ఆదర్శంగా తీసుకొని నీకు నీరాజనాలర్పిస్తారు.

ఆశ : (సంతోషంగా) అన్నాయ్!

దాసు: హృదయపూర్వకంగా ఆశీర్వదిస్తున్నాను చెల్లాయ్! అన్నమాటేదో అన్నేఅన్నావ్. నీతినివదిలి మతిని మరోచోట కొదవపెట్టి డబ్బుకోసం గడ్డితిని గుడ్డి సిద్ధాంతాలు సృష్టించి పేదకుటుంబాల్ని రచ్చకీడ్చి రాద్ధాంతాలుచేసే పురుషోత్తంలాంటి విషపురుగులకి తగిన ప్రతీకారం చేయాలి. కాని, యేంలాభం? (నిట్టూరుస్తాడు.)

ఆశ : ఏం?

దాసు: ఈ ఆలోచనే ముందుంటే యెంత బాగుండేది!

ఆశ : ఇప్పుడుమాత్రం మించిపోయిందేముంది? నువ్వు నాకు అండగావుంటేచాలు. యెట్టి విపరీత సంఘటన

నైనా యిట్టే సునాయాసంగా యెమర్జెన్సీని విజయం సాధించగలను. దానికి నాంది ప్రస్తావనగా... ...

దాసు: పెళ్ళిళ్ళనే పంకతో పేదసంసారాల్ని స్మశానాలుగా మార్చే పరమేశందాద్వారా ఆ పురుషోత్తంకి కబురు చెద్దామా ?

ఆశ : ఏమని ?

దాసు: (వెటకారంగా) "ఓ పరమ లుబ్ధాగ్రేసర పాతక చక్రవర్తీ ! మీతో పొత్తుకుదరదు" అని వార్త పంపితే... ...

ఆశ : చాలా బాగుంటుంది.

పరమే: (బయటనుంచివస్తూనే) అబ్బాయ్ దాసూ !

ఆశ : సమయానికి దేముడులాగా మీరేవచ్చారు.

పర : (నిట్టూర్చి) దేముడో దెయ్యమో తర్వాత. మధ్య తిరగలేక నేచస్తున్నాను.

దాసు: (వెటకారంగా) ఏంపాపం ! అప్పుడే అంతిమాటను కున్నారు ?

పర : అనుకోక చేసేదేముంది నాయనా ! మధ్యవర్తిగావుండి యెన్నో సంబంధాలు యీ హస్తంమీద కుదిర్చి యెన్ని పెళ్ళిళ్ళో చేయించాను. నిజంచెప్తే నమ్ముతారో లేదోగాని వాళ్ళ కాపురాలన్నీ యెలావున్నాయను కున్నారు ? నిత్యతోరణం పచ్చకళ్యాణంగా (నాలుక కరుచ్చుకొని) అహహా ! పచ్చతోరణం నిత్యకళ్యాణంగా వున్నాయ్. హాయిగా సంసారాలుచేస్తూ పెద్దవాళ్ళ

సంకల్పం వికల్పంకాకుండా సంవత్సరం తిరక్కుండానే సంతానం !

ఆశ : (హేళనగా) అంతా తమ హస్తవాసి.

పర : ఆఁ! అలాఅన్నావ్ బాగుంది. నేను సంపాదించుకున్న పేరుకి నాహస్తవాసికి తిరుగు లేదమ్మాయ్.

దాసు: మరి యీ సంబంధం యిలా అయిందేం ?

పర : అడగవలసినప్రశ్నే అడిగావ్. నేనూ అదే చెప్ప బోతున్నాను.

ఆశ : ఏమిటో తెలవియ్యండిమరి ?

పర : ఏముందమ్మాయ్ ! యేదుర్ముహూర్త ఘడియల్లోనో 'తథాస్తు' అని అనుకొనుంటాం. అంతే ? (నాలుక చప్పరించి) అయినా మించిపోయిందిలేదు. ముహూర్తానికి ముందర ఎంత పేచీలుపడితే పెళ్ళయ్యాక ఆ దంపతులు అంత ఆదర్శంగా కాలం గడుపుతారు !

దాసు: అవునవును ! (ఆశతో) నేను చెప్పలా !

పర : (ఉబ్బిపోతూ) ఏమి టేమిటి ! నాకుతట్టినవ్వూహే నీకూ తట్టిందీ ! తెలివైనవాడివంటే నువ్వే !

ఆశ : పెద్దలు. మీ తెలివిముందు మా అన్నయ్య తెలి వెంతలెండి !

పర : అహహ ! అలా అనకమ్మాయ్ ! మీఅన్నయ్యంటే సామాన్యు డనుకున్నావా ? ఎంత తెలివైనవాడు ! యెంతయోగ్యుడు ? ఆఁ! నీపెళ్ళికాగానే మాంచి సంబంధం దాసుక్కూడా యీ హస్తంమీద కుదర్చనూ ?

దాసు: ఏమిటీ! (గుడ్లుమిటకరించి) నా పెళ్ళికూడా మీహస్తం మీదుగా జరగాల్సిందే!

పర : చూశునామజా! మీ చెల్లెలకు యిస్తున్న అయిదువేల కట్నానికీ మరో అయిదువేలు కలిపి మొత్తం పదివేలూ నీ కాళ్ళముందు గుమ్మరించేలా చేయనూ? (పౌడిగా దగ్గుతాడు.)

ఆశ : (గుండెలమీద చేయివేసుకుని తెల్లబోయిచూస్తూ) కట్నమే!

పర : ఆఁ! అంతా యింటిలోవుంది. (హస్తం చూపిస్తాడు.)

దాసు: (హేళనగా) సెంటు భూమన్నా లేదు! అంత కట్నం నాకెవరిస్తారండీ?

ఆశ : ఎవరిస్తా రేమిటన్నాయ్! జుట్టూ జుట్టూ ముడి పెట్టడంలో ప్రవీణ్యులైన పరమేశంగారి చూటుంటే తిరుగుండా?

పర : (పరాకుగా) అవునవును! (తేరుకొని కోపంతో) ఆఁ! యేమన్నావ్? జుట్టూ జుట్టూ ముడి పెడ్తానా?

దాసు: (సర్దుబాటుచేస్తూ) కోప్పడకండి పరమేశంగారూ! ఏదో చిన్నతనం, తెలియక అందిలెండి.

పర : (కోపం తగ్గించుకొంటూ) అని నాకు తెలియదూ?

ఆశ : మాటల సందర్భంలోపడి వచ్చినపనే మర్చిపో యుంటారు.

పర : మర్చిపోతే యెలాగు? గుర్తుంది.

దాసు: ఏమిటది?

పర : "డబ్బు యెలాగైనా తెస్తాను. పెళ్ళివార్ని బయల్దేరి వుండమనండి" అని నాన్న చెప్పారు. ఆ వార్త భుజానవేసుగెళ్ళి అక్కడ పడేశాను. వాళ్ళు ప్రయాణ సిద్ధమైవున్నారు. యిక్కడ పరిస్థితి యెలావుందో తెలియక మళ్ళీ కాళ్ళీడ్చుకుంటూ వచ్చాను. (నిట్టూర్చి) తిరగ లేక విసిగిపోతున్నా !

దాసు: తిరక్కుండావుంటే ?

ఆశ : (హేళనగా) జేబునిండేదెలాగు ?

పర : (వుక్రోషంతో) ఆఁ ! ఏమిటమ్మాయ్ ! చిన్నతనం మాటలూ నువ్వూను !

దాసు: (గుర్తుచేస్తున్నట్లుగా) చెప్పానుకాదండీ ! చిన్న తనమని... ...

పర : (తగ్గి మామూలుగా) అవునవును. చెప్పావుగా ! (నవ్వేఁనో గుర్తుకొచ్చినట్లుగాచూస్తూ) అదిసరే ! యింతకీ సీతయ్యగారు యెక్కడికివెళ్ళారో యేమో ! రెండుగంటలు కావచ్చింది. యింతవరకూ తలా తోకా లేదు. పెళ్ళివార్కి యేంచెప్పాలో యేమిటో !

దాసు: నేను చెప్పేదా ?

ఆశ : ఆలశ్యందేనికి? వెళ్ళిచెప్పమను. (దాసునిచూస్తూంది.)

పర : దానికేం ! తప్పకుండా చెప్తాను. మీరుచెప్తే ఒకటి, మీనాన్నగారుచెప్తే ఒకటీనా ? (చిన్నగానవ్వి) చెప్పఁ యేంచెప్పాలో ! (దాసుని చూస్తాడు.)

దాసు: వారిసంబంధం రద్దని... ...

ఆశ : చెప్పిరండి.

పర : (తెల్లబోయి) ఏమన్నారూ? (మందలింపుగా) శుభం పలకరా వెంకన్నా అంటే పెళ్ళికూతురు ముండే దన్నట్లాయె. యేంమాటలు దాసూ?

దాసు: ఏముందండీ! తమదయాంటూ యీ సంబంధం కుదిర్చారు.

పర : కుదిరిస్తే?

ఆశ : ఏమంటూ కుదిర్చారో ఆరోజునుంచీ మాయింట్లో యేఒక్కళ్ళకూ మన స్తిమితంలేదు.

దాసు: మహానుభావులు. యిదంతా తమచలవే! (నమస్కరిస్తాడు.)

పర : (కోపంగా) చాల్లే వూరుకోండి. యెవరన్నా వింటే నవ్విపోతారు. (తెల్లబోయి స్థాయితగ్గించి) కొంపతీసి నిజమే ననుకుంటారుకూడా.

ఆశ : ఇందులో అసత్యమేముంది?

దాసు: (హేళనగా) నూటికి నూరుపాళ్ళూ నిజం.

పర : మీగురించి యెంతశ్రమపడ్డానో యేమిటో మర్చిపోయారూ? యీ మాటలు మీరనాల్సినవేనా?

దాసు: (చిరుకోపంతో) మర్యాదస్తులం కాబట్టి మాటల్లో మందలించి వూరుకున్నాం. మరొకళ్ళయితే నీఅత్యాచారాలకు చేయాల్సిన పరాభవంచేసి మరీపంపేవాళ్లు.

ఆశ : (బాగాకోపంతో) సంబంధాలనేవంకతో సంసారాల్ని స్మశానాలుగా మార్చేమీరు, పెళ్ళిళ్ళనేవంకతో యెందరి ప్రాణాల్నో పొట్టనపెట్టుకునేమీరు, చేస్తున్న

పని సక్రమమైందికాదని గుర్తించండి. ఈ రోజుల్లో ఆడపిల్లలగతి యెలాగుందో ఒక్కసారి చూడండి.

పర : (రోషంతో) చూస్తున్నాం కనుకనే పెళ్ళిళ్ళు చేస్తున్నాం.

దాసు: మీరు చేస్తున్నారు. తట్టుకోలేక ప్రజలు చస్తున్నారు.

పర : చూస్తున్నావామ్మాయ్! మీఅన్నయ్య మాటలు ?

ఆశ : (వెటకారంగా) వింటున్నాను. మీరు చేస్తున్న ఘోరాలు కళ్ళారా చూస్తున్నాను.

పర : (రోషంతో వెటకారంగా) సంతోషించావంతే :

దాసు: సంతోషించక యేంచేస్తారు ? యీ రోజుల్లో ఆడపిల్లల పెళ్ళంటే సుఖంలేదు. యీడూ జోడూ, దాంపత్యం మంచిచెడ్డలూ యోచేవాళ్ళేలేరు. ఏఒక్కళ్ళను కదిలించినా వేలు సంపాదించాలన్న వెర్రి ఆపేక్షతప్ప మరేమున్నావుందా? కట్నం పెట్టగలుగుతే కుర్రాడు దొరుకుతాడు. ఆ తాహతు లేని వాళ్ళు యేంచేస్తున్నారు ? ఏ తాతయ్యచేతనో తాళి కట్టించి తనబాధ్యత తీర్చుగుంటున్నారు. యిది జరుగుతున్న ఘోరం !

పర : (నిర్లక్షంగా) ఒకచంపకొడితే పాలు, మరో చంప కొడితే నీళ్ళుకారే కుర్రలు! మీతో వాదమాడే కంటే మళ్ళీరాపటం మంచిది. (వెళ్ళబోతాడు.)

ఆశ : పరమేశంగారూ !

పర : (ఆగి) ఏమ్మా ! యివ్వాల్సిన సొమ్ము యింకా మిగులున్నాయా ?

దాసు: వున్నా మీకొచ్చిన తంటాలేదు. మీరు సంబంధాలు కుదిర్చేది మావంటివాళ్ళమీద దయవుండికాదుగా! యీవంకతో జేబులు నింపుగ్గోటానికి! అదిమీకు బాగా అలవాటయింది. అవునో కాదో యిందులోసి యదార్ధాన్ని అపార్ధం చేసుగోకుండావుంటే మీకే తెలుస్తుంది.

పర : ఆఁ! (ఆశ్చర్యంగా) ఎంత తెగించి మాట్లాడు తున్నారు!

ఆశ : అవును. యిటువంటి సంఘటనల్ని మీ నిత్యజీవితంలో మీరు యెన్నో చూస్తూంటారు.

పర : అయిందా యింకేమన్నావుందా ?

దాసు: (కోపంతో) వున్నా వుండకపోయినా ఈ సంబంధం రద్దుచేసుకున్నట్లు ముందా పురుషోత్తంతో చెప్పిరండి.

పర : (నీరసంగా) చెప్పాల్సిందే!

ఆశ : మధ్య మీకు బాధెందుకు ? చెప్పమన్నమాటేదో చెప్పండి.

పర : అదికాదమ్మాయ్! (యేదో చెప్పబోతాడు.)

దాసు: ఏదయినా ఆ ప్రకారం జరిగితీరాల్సిందే!

పర : ఈమాటే ఖాయమా ?

ఆశ : యెన్నోసార్లు చెప్పనక్కర్లేదు.

పర : ఈ నిర్ణయం మీకేమన్నా బాగుందీ ?

దాసు: తప్పొప్పులుగురించి తర్వాత చర్చించుకుందాం. ముందీ సంగతి వాళ్ళకుచెప్పి ... ...

ఆశ : వచ్చినదార్నే దయచేయమనికూడా చెప్పండి.

పర : (నీరసంగా) నాదేముంది! మీయిష్టం. చెప్పమన్న మాటేదో చెప్తాను. యేదన్నానన్తే......(సీతయ్య వెంకటేశం బయటనుంచి వస్తారు.)

దాసు: చూసుగోటానికి మేం సిద్ధంగావున్నాం.

సీత : ఏమిటది? (ఆశ లోపలకు వెళుతుంది.)

పర : సంబంధం రద్దయినట్లు చెప్పిరమ్మన్నారు.

సీత : ఆఁ! డబ్బు తెచ్చానుగా! యింతలో అంత తొందరపడి రద్దుచేసుకోవాల్సిన అవసరమేమొచ్చింది? (పరమేశాన్ని చూస్తాడు)

దాసు: (నిర్లక్ష్యంగా) వచ్చిందికాబట్టే! (వెంకటేశాన్ని చూస్తాడు.)

వెంక : మీరు కబురు చేస్తున్నారా?

దాసు: అవును.

వెంక : అంతా జరిగిపోయాక తొందరపడి లాభమేమిటి?

సీత : (అవునన్నట్లు తలపంకించి దాసుని కోపంగాచూసి పరమేశంతో) అవన్నీ నేను చూసుకుంటాను. మీరు వెళ్ళి వాళ్ళకు ప్రయాణం చెప్పండి.

దాసు: (స్థాయిగా) నానాన్నా!

సీత : నోర్మూయ్యరా! సిగ్గులేక......

పర : కోప్పడకండి సీతయ్యగారూ! (చిన్నగానవ్వి) కుర్రతనం. (దాసు గబగబా లోపలకు వెడతాడు) నేను వెళ్ళొస్తానుమరి!

సీత : (సరేనన్నట్లు తలపంకిస్తాడు. పరమేశం బయటకి వెడతాడు.)

వెంక : (పరమేశం వెళ్ళాక) మీ అవస్థచూశాక పొలం అమ్మగా వచ్చిన పైకంవుంటే అడ్డంవేశాను. మీ అధికారిరాగానే మాత్రం... ...

సీత : (చిరునవ్వుతో) ఎంతమాట! మీరు చేసిన సహాయానికి యిన్నిసార్లు చెప్పాలా?

వెంక : నేను చెప్పిన విషయాలు గుర్తున్నాయిగా! నేను మీకు సహాయంచేసినట్లు మీ పెదవిదాటి బయటకి రాకూడదు. అసలే మామామయ్య దేవాంతకుడు. ఏమాత్రం వాసనవచ్చినా యిట్టే పసికట్టేస్తాడు. చేసిందంతా వృధాఅవుతుంది. మర్చిపోకండేం!

సీత : అలాగే!

వెంక : నేను వెళ్లొస్తాను. (నమస్కరిస్తాడు. సీతయ్య ప్రతి నమస్కారం చేస్తాడు. వెంకటేశం బయటకి వెడతాడు. సీతయ్య వెంకటేశం వెళ్ళిన మార్గంవేపు చూస్తాడు. ఆశ లోపలనుంచి వస్తుంది.)

ఆశ : (మామూలుగా) నాన్నా!

సీత : (ఆశకు పైకంయిచ్చి) యీ పైకం దాయమ్మా!

ఆశ : (పొట్లం అందుకొని) యీ సంబంధం నాకు వద్దు నాన్నా!

సీత : నువ్వు చెప్పకుండానే వూహించాన్లేమ్మా! (ఆశ సీతయ్యని అదోలాచూస్తుంది) దాసుకి వేళ్లొచ్చాయ్. యేంలాభం? ఆలోచనా పాలోచనావుంటేగా!

యెంతతోస్తే అంత! యెందునా కాకుండా నీ బ్రతుకు పాడు చేయటానికే నీకీసలహా యిచ్చాడు.

ఆశ : వద్దని చెప్పింది నేనే!

సీత : (నొసళ్ళు చిట్లించి) నువ్వా చెప్పావా?

ఆశ : మీ మాటకు యేవిషయంలోనూ, యెప్పుడూ యెదురు చెప్పలేదు. యీ విషయంలో... ...

సీత : అనకూడదమ్మా! చాలాతప్పు. (దాసు లోపలనుంచి వస్తాడు.)

ఆశ : తప్పే అయింది. అందుకే యిందులోని సత్యాన్ని గ్రహించలేక పోయాను.

సీత : దానికి మనమేంచేస్తాం? రోజులలా వున్నాయ్. పేద వాడైనా భాగ్యవంతుడైనా దాన్ని అనుసరించి తీరాలి.

దాసు: అనుసరణనేమాటను ఆయుధంగా తీసుకొని అనవసరంగా అవస్తలు పడటంలా? సిరిసంపదలు లేకపోయినా చెల్లాయికి భగవంతుడు యిచ్చిన అందంవుంది.

సీత : వుంటే?

దాసు: కావాలని గడపలోకి ఎవరొస్తే వాణ్ణే చేసుకుంటుంది.

సీత : వాడెటువంటివాడైనా సరేనా?

దాసు: (నిర్మొహమాటంగా) ఇంతకంటే పరువుతక్కువ సంబంధం రాదనిమాత్రం గట్టిగా చెప్పగలను.

సీత : (కోపంతో) నువ్వేన్నీ చెప్తావ్. నీవుద్దేశం బోధపడింది లే.

దాసు: నావుద్దేశం యేదైనా దానివుద్దేశంకూడా యిష్టం లేనట్లే కనబరుస్తోంది.

సీత : ఇద్దరూ కూడపలుక్కుంటేసరి ! ఆడదానికైనా, మగ వాడికైనా సాంప్రదాయ సిద్ధాంతాల ననుసరించి వివాహమని సంసారమని ఏర్పాటుచేయటం ఎంతైనా అవసరం.

దాసు: మనం యిలా ఒణుకుతున్నాం కాబట్టే ఆ పురుషోత్తం అలా ఆడిస్తున్నాడు. (ఒకసారి సీతయ్యని కోపంగా చూసి విసుగ్గా) నాకెందుకులే. (చరచరా లోపల కెడతాడు.)

సీత : విన్నావమ్మా అన్నయ్య మాటలు ! అన్నింటిలోనూ తొందరే ! నేననేది అదికాదు. యీడొచ్చినపిల్లను యింట్లో పెట్టుకుంటే ఆక్షేపించటానికి యెవరైనా ముందుకి వస్తారు. యెన్నో అపవాదులకు గురి కావలసి వస్తుంది. వాటినిచూస్తూ ఆహ్వానించేకన్నా ఆచారం ప్రకారం పెళ్ళిచేయటం మంచిదికాదామ్మా !

ఆశ : (దీనంగా) కాదని అన్నామానాన్నా ! ఈ సంబంధం మాత్రం రద్దుచేయమంటున్నాం.

సీత : పిచ్చితల్లీ ! రద్దుచేయటం అనుకున్నంత తేలిక కాదమ్మా ! అభం శుభం తెలియనిదానివి. నీమనస్సు నాకు తెల్సును. నాకష్టాల్ని చూడలేక ఆవేశంతో అంటున్నావేకాని అందువల్లవచ్చే అపఖ్యాతిని గుర్తించలేక పోతున్నావ్.

ఆశ : అర్ధంకాని ఆవేదనతో అనుకునే మాటలునాన్నా అవి.

సీత : (బాధగా) హృదయబాధతో అంటున్నానమ్మా !

ఆశ : నేను గుడ్డిదాన్ని కాను, కుంటిదాన్ని కాదు. ఆకారం అనాకారంగానూ లేదు. నాలో యేంలోటుందని కట్నంపోయాలి ?

సీత : లోటుకాదమ్మా బ్రహ్మగీసినగీటు. దాన్ని కాదనటం మానవమాత్రులమైన మనకు అసాధ్యమైనపని.

ఆశ : ఈ వెర్రివేదాంతాలకు తలవంచుతున్నాం కాబట్టే యిలావుంది. యింతకంటే ... ...

సీత : (విచారంగా) విన్లేను ! ఇంకేమీ చెప్పద్దు. కడుపున పుట్టినందుకు నీసుఖంకంటే నాకు కావలసింది లేదు. యీబొందిలో వూపిరి వున్నంతవరకూ నేను కోరేది అదే ! నేను బ్రతికుండగానే నాకోరిక తీరుతుందో లేదోనని ... ...

ఆశ : (పొంగిపొర్లే దుఃఖంతో) నాన్నా !

సీత : అందుకే యీ సంబంధం కుదిర్చాను. యీడూ జోడూవుంది. కుర్రవాడు బుద్ధిమంతుడు. విద్యే చదివాడు. బోలెడుఆస్తి. నీకేకొరతావుండదు. నేను కావాలని ఆశించిందికూడా అదే ! (విచారంగా) వియ్యంకుడుగారు ఒప్పుకోకపోతే యెంతో కంగారు పడ్డాను. మంచిసంబంధం మించిపోతుందన్న కంగారుతో కాలుకాలిన పిల్లిలాగ తిరిగాను. ఆఖరికి యెన్నో అగచాట్లుపడి మొత్తం పైకాన్నికూడా తెచ్చాను.

ఆశ : ఈ ఒక్కవిషయంలోనూ నామాటవినండి నాన్నా !

సీత : విన్లేనమ్మా ! వినను. అన్నీ సిద్ధంచేసుకున్నాను. చూస్తూకూడా మీరీవిధంగా మొండిపట్టుపడితే మళ్ళీ నాజీవితంలో తలెత్తుకు తిరగ్గలనేమో చెప్పమ్మా ! కొదవపైకం తేవటానికి... ...

ఆశ : మీఅధికారి వచ్చారా నాన్నా !

సీత : లేదమ్మా.

ఆశ : (సందేహంగా) పైకం యెక్కడిది ?

సీత : అవన్నీ నీకెందుకమ్మా ! అప్పుతెచ్చాను. సరేనా ?

ఆశ : మళ్ళీ తీర్చలేక తిప్పలుపడద్దూ ?

సీత : అందుకు నాకు చింతలేదు. నీకోసం, నీభవిష్యత్తుకోసం యేంచేయటానికైనా వెనుదీయను. (విచారంగా) మీఅమ్మ పోయిననాటినుంచీ మీయిద్దర్నీ కడుపులో పెట్టుకుపెంచాను. ఆ సర్వేశ్వరుని కృపవలన పెరిగి పెద్దవాళ్ళయ్యారు. దాసునిగురించి నాకు భయం లేదు. చదువుచెప్పించాను. భగవంతుడిచ్చిన రెక్కలున్నాయ్. వాడి జానెడుపొట్టా వాడు పోసుగో గలడు. నీసంగతంటావా ; యేదో యేర్పాటు చేయక పోతే యెలాబ్రతుకుతావ్ ? (బాగా విచారంగా) నేనా పెద్దవాణ్ణయ్యాను. కాడిరమ్మంటోంది. వూరు పొమ్మంటోంది. బ్రతికుండగానే నీకేదో... ... ... (చెప్పలేక పైకంమువాతో కంటతడి తుచ్చుకుంటాడు.)

ఆశ : ఏడవకునాన్నా !

సీత : (దుఃఖాన్ని సంతోషంగామార్చి) ఏడవటల్లేదమ్మా ! ఆనందం ! పట్టరాని ఆనందం ! ! (తేరుకొని) ఆఁ ! ముహూర్తానికి వేళయింది. పదమ్మా !

ఆశ : మమ్మల్ని అర్థంచేసుకోలేకపోతున్నారు. యిందులో మీకు తలవంపులు వచ్చేదేమీ లేదు. నామాటవిని యీ సంబంధం రద్దుచేయించండి నాన్నా !

సీత : మళ్ళీ మొదటికొచ్చావమ్మా ! (నిట్టూర్చి) సరే ! యెవరెఖర్మలో యేంవ్రాసుందో యెవరు చెప్ప గలరు ! యిదే మీరు కోరేదైతే అన్నాచెల్లెలు యేకమై మీయిష్టంవచ్చినట్లు చేసుకోండి. (బయటకి వెళ్ళబోతాడు.)

ఆశ : ఎక్కడికినాన్నా ! (అనుమానంగా చూస్తుంది)

సీత : (ఆగి) సుఖదుఃఖాలు లేనిచోటుకమ్మా !

ఆశ : మీమాటే మీకుగాని మామాట ఆమాత్రం విన కూడదానాన్నా !

సీత : ఒకరిమాట ఒకరు వినేరోజులు కావమ్మాయివి. (వెళ్ళబోతాడు.)

ఆశ : (మార్గానికి అడ్డుగా నిలబడి) వెళ్ళటానికి వీల్లేదు నాన్నా !

సీత : (చిన్నగానవ్వి) ఈనాటికి నన్ను శాసిస్తున్నావమ్మా ! (వెళ్ళబోతాడు.)

ఆశ : (విచారంలో స్థాయిపెంచి) వుండండినాన్నా! (సీతయ్య ఆగుతాడు) మీరు వెళ్ళడంలోగల అంతరార్థం గ్రహించాను. పొత్తిళ్ళలో వుండగానే తల్లిపోతే

కంటికి రెప్పలాగ చూసుకుంటూ పెంచి పెద్దచేసిన మిమ్మల్ని అవమానించాలని, మీమనస్సు కష్ట పెట్టాలని మాకెన్నడూ లేదు. సంఘంలో తెరమరుగున జరుగుతున్న ఘోరాల్ని అణచాలన్న ఆసక్తికొద్దీ అన్నాం. తానొకటి తలిస్తే దైవమొకటి తల్చింది. నిజాన్ని గ్రహించలేక కన్నబిడ్డల్నే అనుమానించారు. అది మీకు అవమానంగా యెంచారు. యేంచేస్తాం! మంచో చెడ్డో మీ యిష్టప్రకారమే కానియ్యండి. (సీతయ్య ఆశతో ఆశని చూస్తాడు) ఆలోచనలేకుండా మీమనస్సుకి బాధకల్గించినందుకు మన్నించండి.

సీత : ఆశా! (సమీపించి దగ్గరకు తీసుకుంటాడు) ఇంట్లోకి పదమ్మా! (దాసు లోపలనుంచి వస్తాడు) దాసూ! విడిదికి వెళ్ళి పెళ్ళివారికి ప్రయాణం చెప్పిరా నాయనా!

దాసు: (చీదరింపుగా) నాకు తెలియదు.

ఆశ : వెళ్ళిరా అన్నాయ్!

దాసు: (యీర్ష్యగా) ఈ ఘోరానికి నువ్వూ అంగీకరించావా?

ఆశ : పరిస్థితులు అలావచ్చాయ్.

దాసు: నాక్కు తెల్సు అలావస్తాయని, నువ్విలా మారతావని. యీమాత్రందానికి అనవసరంగా అల్లరి చేసుకున్నా వెందుకు? ముందుగతిని అర్థంచేసుకోలేక ... ...

సీత : (చిన్నగానవ్వి) దానికేంరా! నీలోవున్న బలహీనత బయటపెట్టుకున్నావుగాని, నాబంగారుతల్లి సిరి సంపదలతో కళకళ్ళాడుతూ హాయిగా వుంటుంది.

దాసు: (వెటకారంగా) ఆఁ! వుంటుంది.

ఆశ : అన్నాయ్! (సీతయ్యతో) వాడితొందర మీకు తెలియదా నాన్నా!

సీత : తెల్సునమ్మా తెల్సు. నామాటంటే వాడికి విలువ లేదని నాకు బాగా తెల్సును.

ఆశ : (దాసుతో) నాన్నమాటవిని వెళ్ళరా అన్నాయ్!

సీత : ఎందుకులేమ్మా! నేనే వెడతాను. నాకు తప్పుతుందా?

దాసు: (ఆశ సీతయ్యలనుచూసి) నేనే వెడుతున్నాన్లే! (బయటకు వెళ్ళబోతాడు. బయటనుంచి పరమేశం తొందరగా వస్తాడు. ఆశ లోపలకు వెడుతుంది. పరమేశాన్నిచూసి దాసు ఆగిపోతాడు.)

పర : (దాసునిచూసి రెండడుగులేసి సీతయ్యతో) ఇంకా యిలాగే వున్నారా! వచ్చేస్తున్నారండీ పెళ్ళివారు. (సన్నాయిమేళం దూరంనుంచి వినబడుతుంది) మరో సంగతి! (దాసుని చూస్తాడు. దాసు లోపలకు వెడతాడు) వాళ్ళకు యివ్వాల్సిన కట్నంతాలూకు అయిదువేలూ, లాంచనాలుతాలూకు వెయ్యి, వెరసి ఆరువేలూ వాళ్ళు మీగడపలో కాలుపెట్టిన మరుక్షణం యివ్వాలని, ముహూర్త సందర్భంలో కట్నరూపేణా చదివించటానికి వీల్లేదని మరోసారి గుర్తు చేయమన్నారు పురుషోత్తంగారు.

సీత : అలాగే! మీరు తీసుగెళ్ళియిచ్చినా సంతోషమే. యిప్పుడేయిస్తాను.

పర : అహహ! యెంతమాట! యెంతమాట! నాకు వుభయులూ ఒక్కటే! నేను తీసుకెళ్ళి యివ్వటం మర్యాదకాదు. వాళ్ళు మీయింటికిరాగానే వాళ్ళకు మీరే స్వయంగా యివ్వటంమంచిది. (అటూ యిటూ చూసి స్థాయితగ్గించి) పోతే నా తాలూకు బహుమాన మంటారా ముహూర్తం అయినాక ముట్టచెప్పండి.

సీత : మీ తాలూకు పైకంకూడా ... ...

పర : ఇప్పుడు కాకపోతే మీఅధికారి వచ్చాకనే ఇవ్వండి. మీయిష్టం. (సీతయ్య సరేనన్నట్లు తలపంకించి లోపలకు వెళ్ళబోతాడు) ఆc! మరోమాట! (సీతయ్య ఆగి పరమేశాన్ని చూస్తాడు. దాసు లోపలనుంచి వచ్చివింటాడు) అప్పారావుగారి అమ్మాయి సుబ్బమ్మ పెంపుడుకూతురు సూరమ్మ ఆడబిడ్డ చెల్లెలు చలనమ్మ పెళ్ళి యీ ముహూర్తానికే. అదీ మన హస్తంమీదనే కుదిర్చాం. వెళ్ళి నూతన వధూ వరులకు అక్షింతలు వేసివస్తాను.

సీత : చిత్తం. (లోపలకు వెడతాడు. పరమేశం బయటకి వెళ్ళబోతాడు.)

దాసు: (సీతయ్య వెళ్ళినమార్గాన్ని ఒకసారిచూసి) ఇదిగో పరమేశంగారూ!

పర : (ఆగి దాసుని చూస్తాడు.)

దాసు: యిలారండి. (పరమేశం సమీపిస్తాడు) చూడండీ! మీరు తిరిగి రాకపోతే యిక్కడ పనులు ఆగిపోవు గాని, అక్కడ పనేదో పూర్తిచేసుకొని మరో కొత్త

ఛాన్సు అంటే మరొకళ్ళ కొంప గుణ్ణం వేయటానికి ప్రయత్నించండి.

పర : (వుద్రేకంగా) అదే వుద్యోగం!

దాసు: అందుకే మీరు బ్రతికున్నారు.

పర : (మాట తడబడుతూ) చచ్చాల్లే!

దాసు: (కోపంతో) ఛీ పో! (పరమేశం తుళ్ళిపడి బయటకి వెడతాడు. ఆదారేన్నే పురోహితుడు శాస్త్రి దర్భలు కట్ట పట్టుగువస్తాడు)

శాస్త్రి: పానకంకావిళ్ళు తీసుగు వెళ్ళటానికి ఆలశ్యమేమిటి?

దాసు: పానకంకావిళ్ళు గీనకంకావిళ్ళు అని కూర్చోక మండపందగ్గర జరగాల్సిన పను లేమిటో చూసుకోండి.

శా : అన్నీ సిద్ధంచేశావా?

దాసు: మా యింట్లో వున్నవేమిటో అక్కడపెట్టాం. యేం చేసుకున్నా వాటితోనే చేసుకోవాలి.

శా : (తెల్లబోయిచూసి నెమ్మదిగా లోపలకు వెడతాడు. బయటనుంచి మేళం గట్టిగావినిపిస్తుంది. పురుషోత్తం, వెంకటేశం, వాసు, మరోయిద్దరు పెళ్ళిపెద్దలు బయట నుంచి వస్తారు. లోపలనుంచి సీతయ్య వస్తాడు.)

సీత : ఆడంగుల్ని ఆగుమ్మంవెంట రమ్మనండి. (వెంకటేశం సరేనన్నట్లు తలపంకించి బయటకుచూస్తూ ఆడంగులకు సైగచేస్తాడు) రండి బావగారూ!

పురు : (సీతయ్యనుచూస్తూ) జరగవలసిన కార్యక్రమం చాలావుంది.

సీత : మాఆలశ్యమేమీ లేదు బావగారూ!

పురు : ఇప్పటికే చాలాఆలశ్యమైంది. ముహూర్త ఘడియలు దాటకముందే ఆ మూడుముళ్ళూ పడిపోవాలి.

దాసు: (పక్కగా చూస్తూ) ముందరే ముడుపు చెల్లించమనేవో !

సీత : (మందలింపుగా) దాసూ! (దాసునిచూస్తాడు. తర్వాత పురుషోత్తంతో) రండి పైకం యిస్తాను. (వెంకటేశం అక్కడున్న మంచం వాల్చుగు కూర్చుంటాడు.)

పురు : ఫరవా లేదు. యిక్కడకు తీసుకురండి. (సీతయ్య లోపలకు వెడతాడు. పురుషోత్తం కుర్చీలో కూర్చుంటాడు.)

వెంక : (దాసునిచూస్తూ) రా బ్రదర్ ! (వాసు మంచంమీద కూర్చుంటాడు.)

దాసు: (వెటకారంగా) కట్నండబ్బు ముట్టకుండానే కలుపు గోరుతనం చూపకండి.

వెంక : (నవ్వి) మనమంతా ఒకటే ! సందేహించకండి. మనిద్దరం బ్రదర్స్ అవుతాం. కమాన్ !

దాసు: (వెంకటేశంని సమీపించి వాసునిచూస్తూ) నమస్కారం వాసుదేవరావుగారూ !

వాసు: (ప్రతినమస్కారంచేస్తూ) నమస్కారం ! (చిరునవ్వుతో) కూర్చోండి.

దాసు: మీలాగే మేమూకూర్చుంటే పనులెలా అవుతాయ్?

వెంక : (వాసునిచూస్తూ దాసుతో) యివ్వాలికి యెలాగో కష్టపడండి. రేపటినుంచి యింటిపని బయటపని అంతా మనవాడే చూసుకుంటాడు.

వాసు: (స్వాయిత్తగ్గించి వెంకటేశాన్నిచూస్తూ) యేమిట్రా అన్నావ్ ?

వెంక : పైగా రోషందేనికిరా ! మొత్తం ఆరువేలుపోసి కొన్న వ్వరుడు ఆమాత్రం ఆదుకోకపోతే యెలారామరి?
(సీతయ్య లోపలనుంచి వస్తాడు.)

పురు : (మందలింపుగా) వెంకటేశం ! (వెంకటేశం గుటక్కుమింగి విరుస్తాడు.)

సీత : మీకు యివ్వాల్సిన కట్నంతాలూకు అయిదువేలు, లాంచనాలుతాలూకు వెయ్యి, మొత్తం ఆరువేలూ యివిగో బావగారూ ! (అందిస్తాడు.)

వెంక : (నిట్టూర్చి) అమ్మయ్య !

పురు : (ఒకసారి వెంకటేశాన్నిచూసి పొట్లం వ్రూడదీయ బోతాడు.)

వెంక : (పురుషోత్తంనిచూస్తూ వాసుతో) ఒరేయ్ వాసూ ! ఆ డబ్బుకోసమే యింత రాద్ధాంతం అయింది. యెందుకన్నా మంచిది. చాటుకివెళ్ళి జాగ్రత్తగా లెక్కపెట్టుకోమని చెప్పు. కొంపతీసి కొన్నినోట్లు గాలికి యెగిరిపోయినాచిక్కే. మళ్ళీ ఆ పెద్దమనిషి తీసుకురాలేడు. (పురుషోత్తం కటువుగాచూసి గబ గబా లోపలకు వెడతాడు. దానూ వెంకటేశం నవ్వుతారు. వాసు సిగ్గుపడతాడు.)

శాస్త్రి: (లోపలనుంచివచ్చి) పెళ్లికుమారుడుగారూ! (సీతయ్య లోపలకు వెడతాడు.)

వెంక : లేచివెళ్ళండి.

దాసు: (హేళనగా) తండ్రిగారు చెప్పాలేమో !

వెంక : (దాసుతో) ఏమనుకున్నారుమరి? (జాలిగా) పాతిగేళ్లు పైనపడ్డా పిచ్చిసన్యాసికి స్వతంత్రం శూన్యం. (దాసు శాస్త్రి నవ్వుతారు.)

వాసు: (గబాల్న లేచి) బావా !

వెంక : ఆఁ ! (ఆశ్చర్యంగా) వుండండొకసారి. నీకూ పౌరుషం వస్తుందే ! (దాసు శాస్త్రి మళ్ళీ నవ్వుతారు.)

పురు : (లోపలనుంచి పెద్దగా) వాసూ ! (వాసు గబగబా లోపలకు వెడతాడు. అవెనకే శాస్త్రి వెడతాడు.)

వెంక : మళ్ళీ యేదోవచ్చింది. రండి. (దాసు వెంకటేశం కూడా ఆదుర్దాగా లోపలకు వెడతారు.)

[ తెర వ్రాలును. ]

# రంగం 3

[ సీతయ్యగారియింట్లో వివాహ మండపం. ఎదురుగా పీటలమీద వాసు, అతనికి కొంచెం దూరంలో అటూ యిటూ పురోహితులు (శాస్త్రుల్ను). ఒక ప్రక్కగా పరిచివున్న చాపలమీద వెంకటేశం తదితర పెళ్ళి పెద్దలు కూర్చొనివుంటారు. పురుషోత్తం జేబుగడియారం చూసుకుంటూ పురోహితుడు ప్రక్కగాను, దాసు సీతయ్యలు లోపలనుంచివచ్చే గడపదగ్గిర నిలబడి వుంటారు. మేళం గట్టిగా వినబడుతూవుంటుంది. తెరప్రక్కకుతొలుగుతుంది. ]

1వ శాస్త్రి: (మంత్రం) అవిధవాభ వర్గాణి చేతసా గంతు స్రువంతు.

పురు : శాస్త్రిగారూ! మంత్రాలు సావకాశంగా చదువు దురుగాని ముందు ఆ ముహూర్తం వేయించండి. యిప్పుడు మూడుగంటలయింది. ముహూర్తం మూడు నిముషాల్లోవుంది.

1వశా: చిత్తం. చిత్తం. పెళ్ళికుమార్తెగార్ని తీసుకురండి. (సీతయ్య లోపలకువెళ్ళి ఆశను తీసుకొస్తాడు) అమ్మాయ్! కుడికాలు ముందుపెట్టి కూర్చోమ్మా! (ఆశ అలాచేయబోయి సీతయ్యను ఒకపర్యాయం చూసి కాళ్ళకు నమస్కరిసుంది. సీతయ్య కంటతడి తుడుచుకుంటూ లేవదీసి
తాడు. రెండో పురో॥ పుచ్చుకున్నపైకం పెట్టెల
యిస్తాడు) నాయనా! ౯
ధారణచెయ్. (వాసు-సోసూ! (పోలీసు ప్రవాసు
కుంటాడు.)

దాసు: (హేళనగా) బలేపెళ్ళి ! (వెంకటేశం నవ్వుతాడు.)

1వశా: మేళాలు గట్టిగా వాయించమనండి. అబ్బాయ్ ! రెండుముళ్ళూ గట్టిగావేసి మూడోముడి కొంచెం వదులుగా వేయ్. (దాసు అలాచేస్తాడు.)

1వశా } మాంగల్యతంతు నానేనా మమజీవన హేతునా
2వశా } కంఠే భద్నామి శుభ. (గిరీశం యిద్దరు పోలీసుల్ని వెంటపెట్టుగు బయటనుంచి వస్తాడు. అంతా ఆశ్చర్యముగా చూస్తారు. పురోహితులు లోలోన గొను క్కుంటూంటారు.)

పురు : (ఆశ్చర్యంగా) ఆఁ! (ఒకళ్ళనొకళ్ళు చూసుకుంటారు.)

గిరీ : పెళ్లిపెద్దలు ఎవరు ?

దాసు: అందరూను.

వెంక : (అర్థంకానట్లు) పనేమిటి ?

గిరీ : ఏమిటా ? అరస్టు చేయటానికి వచ్చాను.

పురు : ఎందుకు ?

గిరీ : చట్టాన్ని వ్యతిరేకించి కట్నం పుచ్చుగున్నందుకు.

వెంక : మంచిసమయానికే వచ్చారు. ఈ సందర్భంలో నన్ను

గిరీ : (పురుషోత్తంనిచూస్తూ అధికార స్వరంతో) ఊఁ!
(వెంకటేశాన్నిచూస్తూ మామూలు స్థాయిలో)
మీరెవరు ?

వెంక : చెప్పఁగోటానికి చిన్నతనంగావున్నా తప్పనిసరై
చెప్తున్నాను. నేను (పురుషోత్తంని చూపించి) ఆయన
అల్లుణ్ణి. మేనల్లుణ్ణీను. పేరు వెంకటేశ్వరరావు.

గిరీ : ఇంటిపేరు ?

వెంక : సీతంరాజువారు.

గిరీ : (పక్కన పోలీసునిచూస్తూ) ఏయ్ ! ఫోర్‌ట్వెంటీ !
నోట్ చేసుకో.

వెంక : ఆయనే పెళ్ళికుమార్తె తండ్రి పురుషోత్తంగారు.
వడ్డీతో సహా ఆరువేలు వసూలుచేశారు. అందులో
కట్నరూపంగా చదివించేటందుకు వీల్లేని కండిషన్
మీద !......... ఆ అమాయకుడు పెళ్ళికుమార్తె
తండ్రి సీతయ్యగారు. పురుషోత్తంగారి అదిరింపులకు
బెదిరి ఆరువేలూ అప్పుచేసి మరీ సమర్పించారు.

పురు : నేను కట్నం పుచ్చుకోలేదు.

గిరీ : వాళ్ళుయిచ్చారా పోనీ—

పురు : లేదు.

దాసు: లేదంటే పోతుందా ? పుచ్చుకున్నపైకం పెట్టెలో
కన్నా పోలేదుసార్ !

సీత : (మందలింపుగా) దాసూ ! (పోలీసు వ్రాసు
కుంటూంటాడు.)

గిరీ : అడిగినవాళ్ళుతప్ప యెవరూ మాట్లాడకూడదు. (ఆశతో) నీపేరేమిటి?

ఆశ : ఆశాలత!

గిరీ : లంచమిచ్చేనా ఆయన్ను పెళ్ళిచేసుకునేది?

ఆశ : (సీతయ్యనుచూసి గిరీశంతో) అవును. (సీతయ్య కంగారుపడుతూ పురుషో త్తంని చూస్తాడు.)

గిరీ : ఏం పెళ్ళికొడుకుగారూ! మీరేమంటారు?

వాసు: (లేచి) ఆరువేలూ మానాన్నగారు పుచ్చుకొన్నమాట వాస్తవమే! (ఆశ లేచి దాసు సీతయ్యల దగ్గరకువెళ్ళి నిలబడుతుంది.)

పురు : (ఆవేశంతో) అది కట్నంకాదు. యివ్వాల్సినబాకీ.

గిరీ : అప్పుగా యెప్పుడన్నా యిచ్చారా?

వెంక : అని అంటాడుగాని నమ్మకండి. యిద్దరికీ క్రితం పరిచయమే లేదు.

పురు : తీసుకున్నవాళ్ళను అడిగితే తెలుస్తుంది. అప్పు పుచ్చుకుందీ లేందీ సీతయ్యగార్ని అడగండి. (సీతయ్యను చూస్తాడు.)

వెంక : నేనూ యిన్స్పెక్టర్‌గార్కి అదే చెప్పబోతున్నాను. (గిరీశంతో) అడగండి.

గిరీ : మీరిచ్చిన ఆరువేలూ అప్పతీసుగొని తీర్చారా! కట్నంగా యిచ్చారా?

సీత : (చెప్పటానికి సందేహించి అందర్నీ చూస్తాడు.)

దాసు: (సీతయ్యను సమీపించి) ఇంతవరకూ మీజీవితంలో లేనిమాటలు చెప్పిఎరుగరు. ప్రాణంమీదకు వచ్చినా

అబద్ధం చెప్పకూడదని మాకు చెప్పేవారు. చెప్పండి నాన్నా ! (సీతయ్య పురుషోత్తంని చూస్తాడు.)

పురు : నిజంచెప్పండి సీతయ్యగారూ ! (అదోలా చూస్తాడు.)

వెంక : సీతయ్యగార్కి నీలాగ తననాలుకను యిష్టంవచ్చినట్లు వుపయోగించే అలవాటు వుండీవుండదులే మామయ్యా!

పురు : (వెటకారంగా) ఆహా !

గిరీ : (సీతయ్యనుచూస్తూ) చెప్పండి.

ఆశ : నిజాన్ని నిర్భయంగా చెప్పండి నాన్నా !

గిరీ : (స్థాయిపెంచి) మౌనానికిది సమయంకాదు సీతయ్యగారూ ! చెప్పండి ఆరువేలూ... ...

సీత : కట్నంరూపేణా ఇచ్చాను. (ఆశ దాసులు శ్వాసపీల్చి వదుల్తారు.)

దాసు: (గిరీశంతో) మాకు కట్నమిచ్చే తాహతు లేక పోయినా యీడొచ్చిన పిల్లను యెంతకాలం ఇంట్లో పెట్టుగు కూర్చుంటాం. యేదోవిధంగా బాధ్యత తీర్చుగోవాలిగా !

పురు : అయినా యిచ్చి పుచ్చుగోటం అనేది యీనాటి ఆచారంకాదు.

గిరీ : ఏనాటిదైనా యీనాడు నిషేధింపబడింది.

వెంక : ఆసంగతి మామామయ్యకు తెలియకనా ? చేసిన తప్పు దిద్దుకోటానికి వేస్తున్నాడు యెత్తు.

గిరీ : ప్రభుత్వ చట్టాన్ని వ్యతిరేకించి ప్రవర్తించాక తప్పించుకోటానికి యెంతయెత్తువేసినా ఆది చిత్తు అవాల్సిందే !

వెంక : అని యిప్పుడు తెల్సుకున్నారు ! (పురుషోత్తం: చూస్తాడు.)

గిరీ : వరకట్న నిషేధచట్టాన్ని అనుసరించి పెళ్ళిపెద్దలైన పురుషోత్తం సీతయ్యగార్లను అరెస్టుచేస్తున్నాను (పోలీసుల్ని చూసి తలవిదిలిస్తాడు. పోలీసులు వాళ్ళ ప్రక్కకు వెళ్ళి నిలబడతారు. ఆశ వచ్చేయేడుపు ఆపు కుంటుంది.)

పురు : (వ్రెరిగా) అందుకు నేను ఆక్షేపిస్తున్నాను.

గిరీ : మీ ఆక్షేపణ నిక్షేపంగా కోర్టులో తెలియపర్చుకోండి. (పోలీసుల్ని చూస్తూ) ఊఁ ! పదండి.

ఆశ : (సీతయ్య చేతులు పట్టుకొని) నాన్నా ! చూశావా నాన్నా ! ఆఖరికి మన స్థితి యెలావచ్చిందో ! ఈ సంబంధం రద్దుచేయమని బ్రతిమిలాడితే విన్నారా ? ఈ పాపిష్టురాలు సుఖపడుతుం దనుకున్నారు. ఇప్పుడు బాగా సుఖపడుతుందినాన్నా ! తనకోసం తండ్రి గౌరవాన్ని కొదవపెట్టి ఆ తండ్రి యీ వయస్సులో జైల్లోవుండి నరకబాధ అనుభవిస్తుంటే బాగా సుఖ పడుతుంది నాన్నా !

సీత : అమ్మా ! (కౌగలించుకొని) యేడవకు తల్లీ !

ఆశ : (కంటతడి తుడుచ్చుకొని) యిన్స్పెక్టర్ గారూ ! కట్నం యివ్వటానికి కారకురాల్ని నేను. నన్ను అరెస్టుచేసి మానాన్నను ... ...

: విడిచిపెట్టే హక్కు నాకు లేదమ్మా! ప్రభుత్వ శాసనాన్ని ధిక్కరించినవాళ్ళు ఫలితం అనుభవించక తప్పదు.

: (పొంగివచ్చే దుఃఖంతో) నాన్నా! (కౌగలించుకుంటుంది.)

(ఏడుస్తూ) ఏడవకుతల్లీ! మోవరిఖర్మలో యెలా వ్రాసుంటే అలా జరిగితీరుతుంది.

(అధికార స్వరంతో) ఆలస్యమవుతోంది.

(ప్రక్కనున్న పోలీసునిచూసి గిరీశంతో) ఒక్కమాట యిన్స్పెక్టర్!

వినే అవకాశంలేదు. ఈసందర్భంలో పురోహితులుని, వధూవరులను, పెళ్ళికుమార్తెఅన్న దాసువర్గాలను సాక్షులుగా తీసుకుంటున్నాను.

(గిరీశం చేతులు పట్టుకొని) మాది పెద్దకుటుంబం యిన్స్పెక్టర్! యీ వివాహం తరతరాలుగా వస్తున్న వంశగౌరవానికి మచ్చతీసుకురావటం నాకు యిష్టం లేదు. నాపొరపాటును గ్రహించాను. వరకట్న నిషేధ చట్టాన్ని వ్యతిరేకించినందుకు మన్నించమని హృదయపూర్వకంగా వేడుకుంటున్నాను.

మన్నించటానికి నేనెవరు? అనుభవించి తీరాలి.

అంతేనా?

(తేరుకొని) అంతే! అనుభవించి తీరాల్సిందే. మీరొక్కరే కాదు. మీ మొండిపట్టుదలకు ఆధారంగా అంతా అనుభవించాలి. కూతురు సుఖంకోసం కట్నం

పోసిన ఆయన, ప్రపంచజ్ఞానం లేక పాతికేళ్ళు పై పడ్డా తండ్రి అసభ్య ప్రవర్తనకు తలవంచిన నేను, యింత మూర్ఖుడని తెలుసుండి తండ్రి పరువుకోసం నాచేత గుదిబండ కట్టించుకున్న ఆ అమ్మాయి అంతా అనుభవించి తీరాలి.

పురు : (విన్లేక) వాసూ! (గిరీశంతో) ఆఖరిసారిగా మళ్ళీ మనవి చేసుకుంటున్నాను. యిన్స్పెక్టర్! యిది నా పొరపాటుగా యెంచి మమ్మల్ని విడిచిపెట్టండి. వాళ్ళు మాకు యిచ్చిన ఆరు వేలూ మీసమక్షంలో నే వాళ్ళకు తిరిగి యిచ్చేస్తాను. హృదయపూర్వకంగా యిస్తాను. దయతో ... ...

గిరీ : క్షమించటానికి నాలో యేమీ లేదు. లేకపోయినా వ్యవహారం పై వరకూ పోలేదుకనుక ఒక సలహా యిస్తున్నాను. మీకు వ్యతిరేకంగా సాక్ష్యంయిస్తానని తనకితానే ముందడుగు వేసిన వెంకటేశ్వరరావుగారు అంగీకరిస్తే నాకు యెట్టి అభ్యంతరం లేదు. వారి అంగీకారం తీసుగోకపోతే మీతోపాటు నన్నుకూడా కలిపి వేరే కేసు పెట్టగలరు.

వాసు: (వెంకటేశం చేయిపట్టుకొని) బావా!

పురు : (దీనంగా) వెంకటేశం!

గిరీ : ఏమంటారు వెంకటేశ్వరరావుగారూ!

వెంక : మామామయ్య ప్రవర్తనమారి తనలో పరివర్తన కల్గిందనే అన్నాడుగాని తీసుకున్న సొమ్ము తిరిగి యిచ్చెయ్యలేదు.

వాసు: ఇస్తారుబావా ! (పురుషోత్తంని చూస్తాడు.)

వెంక : ముందు యివ్వనియ్.

పురు : (పైకంపొట్లం సీతయ్యకుయిస్తూ) మీరిచ్చిన ఆరు వేలూ తీసుకోండి బావగారూ ! (సీతయ్య సందేహిస్తాడు. వెంకటేశం తీసుకోమన్నట్లు సైగచేస్తాడు) యీ యివ్వటం పరిస్తితుల్ని బట్టికాదు బావగారూ ! పరివర్తనకలిగి—(అందివ్వబోతాడు )

సీత : వుంచండి బావగారూ ! (తీసుకోడు.)

దాసు: ఇలాయివ్వండి. (పురుషోత్తం చేతిలో పైకం పొట్లాం అందుకుంటాడు. సీతయ్య పురుషోత్తములు దాసుని చూస్తారు.)

వెంక : ఇన్స్పెక్టర్ గారూ! తీసుకున్నపైకం వాపస్ చేశారుగా! ఇంక నాఅభ్యంతరం లేదు.

గిరీ : అయితే మాకు మరీమంచిది. (పోలీసులతో) పెళ్ళి పెద్దల్ని విడిచిపెట్టండి.

సీత : (పురుషోత్తం చేతులు పట్టుగుని) బావగారూ ! (ఆశను దగ్గరకు తీసుకొని యేదో చెప్పబోతాడు.)

పురు : మీరేమీ చెప్పద్దు బావగారూ ! ఆశ మాకోడలు. మాఅమ్మాయిలతో సమానంగా చూసుకుంటానని మాటిస్తున్నాను. (చేతిలో చెయివేస్తాడు.)

సీత : ఆరువేలూ మీరుతీసుకుని ... ...

పురు : అదేవద్దు. అన్నమాటకు తిరుగులేదు. మీరు కాదు కూడదు అంటే ఆ ఆరువేలతోనూ రెండెకరాలు భూమికొని మీతదనంతరం ఆళ దాసులకు చెందేలా వ్రాయండి.

వెంక : ఆఏర్పాటు మంచిదేకాని అందులో ఒక రహస్యముంది.

వాసు: ఏమిటిబావాఅది? (అంతా వెంకటేశాన్ని చూస్తారు.)

వెంక : అందులో రెండువేలు పరమేశంగారిదగ్గర తెచ్చారు సీతయ్యగారు. ఆయనపైకం ఆయనకు యివ్వాల్సిందే గదా! పోతే తతిమ్మా నాల్గువేలూ......

సీత : వారేయిచ్చారు. (వెంకటేశాన్ని చూపిస్తూ పురు పోత్తంని చూస్తాడు.)

వాసు: నువ్విచ్చావా బావా ?

వెంక : ఇచ్చిందినేనైనా డబ్బు మీనాన్నదే !

పురు : (ఆశ్చర్యంగా) నాదా ?

వెంక : ఆరువేలూ యిచ్చితీరాలని మీరు పట్టుపట్టారు. మాఆవిడద్వారా ఎవరూచూడకుండా మీపెట్టెలోవి తీయించి అది నాడబ్బుగా సీతయ్యగారి పరువు కాపాడటానికి అడ్డంవేశాను. (అంతా నవ్వుతారు.)

పురు : ఎంతనాటకం ఆడావ్ ?

గిరీ : అయితే మళ్ళీ తీసుకుంటారా ?

పురు : ఇచ్చాక తీసుకునే అలవాటులేదని మీకు తెలియక పోయినా మా వెంకటేశానికి తెలియదూ ? దాంతో చేయాల్సిన యేర్పాట్లు ముందే చెప్పాను. పోతే ; పరమేశంగారిదగ్గర తీసుకొన్న రెండువేలూ......

పర : (బయటనుంచివస్తూనే) నాకెందుకు ? ఆ సొమ్మంతా యీ నా హస్తాన్ని దుర్వినియోగంచేసి సంపాదించిందేగా ! అంచేత వరకట్న నిషేధచట్ట ప్రచారానికి వినియోగించండి. (అంతా చప్పట్లు కొడతారు.)

పురు : మేమేనా వూరుకునేది ! (సీతయ్యతో) బావగారూ ! మనకు బోలెడు ఆస్తివుంది. ఆ నాలుగు వేలూకూడా ప్రచారానికే వినియోగించండి. (అంతా చప్పట్లు కొడతారు.)

వాసు: చట్టం ప్రవేశించినంతమాత్రాన కట్నాల సమస్య మటుమాయంకాదు. అంతా చేయాలన్న ఆశయం ప్రజల్లోకూడా ప్రతి ఒక్కడికీ వుండాలి.

పర : వుంటుంది వాసూ ! నేను చూడరాదూ యెంత మారిపోయానో ! యింతవరకూ దుర్వినియోగపర్చిన యీ నా హస్తాన్ని... ...

ఆశ : ఇకమీాద మంచిపనులకే వుపయోగించండి. (అంతా నవ్వుతారు.)

గిరీ : నేను వెళ్లొస్తాను సార్ ! పురుషోత్తంని చూస్తాడు.)

పురు : మీరు చేసిన సహాయానికి చాలా థాంక్సు. పెండ్లి పూర్తి అయ్యేవరకూ మీరు యిక్కడే వుండాలి (గిరీశం చేతులు పట్టుకుంటాడు.)

వెంక : వుండక యెక్కడికి వెడతాడు ? సబిన్స్పెక్టర్ రూపంలో వచ్చినవాడు యెవరో కాదు మీ పెద్దల్లుడు గిరీశమే మామయ్యా !

పురు : (త్రుళ్ళిపడి) ఆఁ !

గిరీ : (మీసం, హేట్ తీస్తాడు.)

వాసు: (ఆశ్చర్యంగా) ఇన్స్పెక్టరివి నువ్వా మామయ్యా !

గిరీ : నేను కాబట్టి మీనాన్నను విడిచిపెట్టాను. అసలైన పోలీసువాళ్ళయితే విడిచిపెట్టేవాళ్ళేనా ? (నవ్వి) యీ పోలీసులుకూడా యెవరో కారు మీ పెత్తండ్రి కొడుకులు బాబూరావ్, సుబ్బారావులు ! (పోలీసులు కూడా వేషాలు తీస్తారు.)

దాసు: (ఆశ్చర్యంగా) అరే !

పురు : ఎంతపని చేశారు ?

గిరీ : చట్టం ప్రవేశించకుండా వున్నప్పుడే మాకివ్వాల్సిన కట్నాలు యివ్వక మాకు యెగనామం పెట్టి... ...

వెంక : చట్టం ప్రవేశించాక కట్నం యిచ్చితీరాలంటే యెలా వప్పుకుంటాం ? మేము ఒప్పుకున్నా... ...

దాసు: గవర్నమెంటు ఒప్పుకోవద్దూ ?

గిరీ : ఈ వార్త యేలాగూ ప్రభుత్వానికి తెలుస్తుంది. **పెళ్లిపెద్దలు** యెలాగూ చిక్కుల్లో పడతారు. అందుకని ముందే అంతర్నాటకంఆడి ... ...

దాసు: మామగారి పరువు కాపాడటం కాకుండా... ...

సీత : మనస్సుకూడా మార్చుకలిగారు ! (హేళనగా) మామకుతగ్గ అల్లుళ్ళే !

పర : వ్యవహారం అంతా సర్దుబాటయిందిగా ! వివాహం నిరాటంకంగా పూర్తిచేయించండి. (నవ్వుతారు.)

దాసు: తర్వాత తాపీగా చేసుకోవచ్చు. ముందు నూతన వధూవరులను **పెళ్లిపెద్దల** ఆశీస్సులు అందుకో నియ్యండి.

శాస్త్రి: అలాగే ! (అక్షింతలు తీసుకొని వాసు ఆశల్ని చూస్తూ) రండి నాయనా! (పురుషోత్తంని చూపిస్తూ) నాన్నగారికి నమస్కారం చేయండి.

పురు : (తనకాళ్ళకు నమస్కరించబోతున్న వధూవరులను ఆపి) అహాహా ! నేను చెప్పినట్లు చేయండి.

వెంక : కాదంటే మళ్ళీ మొదటికొస్తుందేమోకూడా ! అసలే మామయ్య ముక్కోపి. ఆయన చెప్పినట్లే చేయండి. (అంతా నవ్వుతారు.)

పురు : నాకు జ్ఞానోదయం కల్గించిన నా యిద్దరు అల్లుళ్ళకూ ముందు నమస్కరించండి. ఆపైన బావగార్కి, దాసుకి, చివరకు నాకు! (చిన్నగానవ్వి అందర్నీ చూస్తాడు. పురోహితుడు మంత్రం చదువుతూంటాడు. బయటనుంచి మేళం గట్టిగా వినిపిస్తుంది. వాసు, ఆశలు పురుషోత్తంలు చెప్పిన విధంగా పెళ్ళిపెద్దలకు నమస్కరిస్తారు. ఆఖరికి పరమేశానికి నమస్కరించబోతారు.)

పర : (సిగ్గుతో) అహాహా! నాకూడా యెందుకు? (వధూవరుల నెత్తిన అక్షింతలువేసి) చట్టాన్ని అనుసరించి ప్రజల్లో మార్పు తీసుకురమ్మని మనమంతా ప్రజలకు హృదయపూర్వకంగా నమస్కరిద్దాం! (అందరూ ప్రజలవేపు తిరిగి నమస్కరిస్తారు)

సంపూర్ణము.



రాజేశ్వరి ప్రెస్, రాజమండ్రి.



సీతంరాజు

1924లో కృష్ణాజిల్లాలో గన్నవరం తాలూకా ముఖాసా వీరవల్లి గ్రామంలో జన్మించారు. ప్రస్తుతం విజయవాడ, మద్రాసుల్లో వుంటున్నారు. తండ్రి-సీతంరాజు గుర్నాధరావు. తల్లి-లక్ష్మీకాంతమ్మ. పదోఏటనే నాటకరంగస్థలం మీద నటుడుగా ప్రవేశించి వివిధ పాత్రలు ధరిస్తూ "హాస్య నట చక్రవర్తి" అని బిరుదు పొందారు: 'సంసారి' సాంఘికనాటకంతో తన కలంద్వారా రచనలు ప్రారంభించి యిప్పటివరకూ 20 సాంఘిక నాటకాలు, 25 సాంఘిక, డిటెక్టివ్, మిస్టరీ, వీరోచిత నవలలు అందిచ్చి ప్రజాభిమాన రచయితగా వెలుగులోకి వచ్చిన యువరచయిత. అచ్చులోవున్న రచనలు మరో పదివరకూ వున్నాయి: స్వంత సమాజం ద్వారా ప్రస్తుతంలో అనేక నాటక ప్రదర్శనాలు యిస్తున్నారు.

**Pelli Peddalu**
By Seethamraju

Price
Rs. 1-50